కం॥ తదుపరిపదవిజితముగుట। నొదిగొంపగువారిఁ జేరియున్నఁ దాఁ జేసై।
యిదియన్నృత మేనికమఠం। బదిముడుచుట యేలభీతినఖిలాంగంబుల్॥ ౨౦॥

కం॥ కలమోదరములుఘనసే। తులసత్ క్షేత్రమునఁ దపముఁ దొలిఁ జేసిగదా।
చెలిజంఘులకెనవోలెను। ఫలసిద్ధి చెలంగకున్నె వరశాలులకున్॥ ౨౧॥

తే॥ గీ॥ కరికరంబులమానంబుకదళిజిగియు। కరభముల సౌకుమార్యమికలికితొడలు।
గైకొనఁగ మలినతయుద్వృక్కటినతయును। జిన్నతనమును నవియొజఁ జెందుచుండె॥

ఉ॥ ఆకమలాసనుండు దనుజాపహృతంబగు నేమొ వెండియున్।
శ్రీకమనీయమైన ధరణీవలయంబని తన్నిజాంకమిా।
స్త్రీకటిచక్రసీమగ సృజించి మఱుంగున డాచెఁ గాకర।
త్నాకరమేఖలాంకవిపులాకృతియైయదియేల పొల్పగున్॥ ౨౩॥

కం॥ ఉన్నదియొ లేదొ యనఁదగు। కన్నియ నెన్నడుము విన్నుగాఁ బోలును గా।
కున్న నురోమావళి రా। హున్నతనీలరుచులచట నుండఁగ నేలా॥ ౨౪॥

చం॥ తృణమగు విల్లిదేటికని యిక్షుశరాసము డించి వేణికా।
గుణయుతమైనయీకుసుమకోమలి కోమలగాత్రవల్లిసిం।
గిణిగ నొనర్చి కొన్మరుఁడు కేలనుఁ బట్టఁ దదంగుళీనిక।
ర్షణభవరేఖలొప్పెనన రాజిలు బిత్తరమైన ముత్తరుల్॥ ౨౫॥

కం॥ ఘనజఘనంబను పులినం। బునఁ బొడమిన పొన్నగున్న పూవనఁదగు నా।
సినినాభియారుతద్వా। సనకైయరుదెంచునళులచాల్గాకున్నే॥ ౨౬॥

సీ॥ నాభీనదమునుండి నడుమను మింటిపైఁ గవగూడి యెగయుచక్రంబులేమొ।
స్ఫురదురోలావణ్యసరసిజనించిన మొనచూపు పొందమ్మిమొగడలేమొ।
నవవయోలక్ష్మియీయువిద పొందూనికానుక యిడ్డరత్నకందుకములేమొ
వరతనూశృంగారవనములో విహరించు మనసిజకుంభికుంభంబులేమొ॥

తే॥ గీ॥ ప్రకటరోమావళీలతాగ్రప్రభూత। సరసవిలసితసుమగుళుచ్ఛంబులేమొ।
తిన్ననయి సిబ్బెములవన్నెఁ జెన్ను మిగిలి। యెన్నఁదగియున్న చెలిగబ్బిచన్నులేమొ॥

మ॥ తతముక్తామణిహారనిర్ఝరపయోధారల్ స్తనస్వర్ణప।
ర్వతభాగంబులఁ బుట్టి కాంచనరుచిన్ వ్యాపించి పెన్నోసగలా।
లతలా నీలతకూనచొక్కమగుకేల్గా వేనిబాలాంగుళీ।
గతచంచన్నఖపుంజఁ పుంజివురుమొగ్గల్పుట్టనందేటికిన్॥ ౨౮॥

క౦॥ కుందనఁపుందళుకందము। క్రిందుపడందనరుసుందరీకంధరమా।
చందనఁపుందెలు పొందుచుఁ। జిందము పొందూనుఁజర్చ సేయందరమే॥ ౪౯॥

సీ। తమలో శ్రవణభూషణములుదోఁచుటఁగపోలములు క్రొమ్మించుటద్దములుగావె।
ఘుమ్మని నెఱతావిఁ గుమ్మరించుట మోమునవ్యఫుల్లారవిందంబుగాదె।
లలిసువర్ణంపుఁగమ్మల సొంపుఁగనుటచేఁ గర్ణముల్ శ్రీవర్ణకములుగావె।
మొనచూపు చూపుతూపులఁ జిమ్ముచుంట వంగిచెలంగుబొమలు సింగిణులుగావె॥
తే॥గీ॥ విబుధసంవేద్యమహిమమై వెలయుచుంట। లలనమృదువాక్ప్రతతిసుధాలహరిగాదె।
యీజగన్మోహినినిసృజియించినపుడు। ధృతిదరలకున్నె మతిశతధృతికినైన॥ ౫౦॥

తే। గీ। వదనముకురంపుబరణిలో మదనుఁడనుప। పల్లవమువోలె వెలికిఁగన్పట్టుచున్న।
రదనవరహీరమాలికతుదఁదనర్చు। నాయకంబనఁగెమ్మోవి నారికొనరు॥ ౫౧॥

క౦॥ నలినమనుశంకనళులీ। లలనావదనంబుఁగ్రమ్మి లావణ్యరసా।
వళిఁగ్రోలకుండుటకునై। నలువటగంధఫలినిలిపెనా నాసదగున్॥ ౫౨॥

క౦॥ వరహాసచంద్రికాభ్రమఁ। దరుణీమణివిమలముఖసుధాకరబింబాం।
తరమునఁ బ్రవాలుచకోరక। వరయుగమనఁగన్నుఁదోయివలనొప్పారున్॥ ౫౩॥

ఉ॥ మంగళలీలఫాలతటమండితమండననీలరత్నరా।
జింగికురించివక్త్రసరసీరుహసౌరభవీచికాచర।
ద్భృంగములో యనంగ వినుతింగొనుచుంగొనబొమెఱుంగులం।
బొంగిచెలంగునుంగరఁపుముంగురులంగనకుంగనుంగొనన్॥ ౫౪॥

తే॥ గీ॥ మౌళిమాణిక్యరుచితటిన్మంజులంబు। రుచిరనవరత్నసీమంతరోహితంబు।
నైనయీమోహనాంగిసోయగఁపునీల। కచముఘునవిభ్రమస్ఫూర్తిఁగాంచుటరుదె॥

సీ॥ ఉరుకచ్ఛపవిలాసము పరిపాదములందు నవనీలరుచికచస్ఫురణయందు।
పద్మరేఖాస్ఫూర్తిపాణులందును మహాపద్మసారూప్యంబు వదనమందు।
శంఖవైభవము రాజత్కంఠతటియందు మకరవిభ్రమము జంఘికలయందు।
గురుముకుందాసక్తిసరసచిత్తమునందుఁ దగుకుందలీల దంతములయందుఁ।
గీ॥ గలిగివిలసిల్లునట్లుఁగాఁ గమలభవుఁడు। నవనిధులనొక్కయెడఁగూర్చియువిదరూప।
ముగసృజించెనయారెయీముద్దుగుమ్మ। మనసుఁగొనువానిరాజరాజనఁగవలదె॥ ౫౫॥

క౦॥ అనియిట్లు మదినివిస్మయ। మొనయఁగనయ్యన్నమిన్న నెన్నుచు పరియం।
జనితత్రపాతిశయంబున। కానందాబ్ధిఁదేలిమునుఁగుచునుండెన్॥ ౫౬॥

కం॥ అని మార్కండేయమహా।మునిక్రోష్టికిఁ జెప్పినట్లు ముదమునఁ బక్షు।
ల్వినుపించిన నపుడా జై।మినియవ్వలి కథనుఁ జేర్మి మెయి నడుగుటయున్॥

చం॥ పరమపవిత్రగాత్ర పురభంజన కుంజర కోణపాంతకా।
గరళగళా కళానిధి సుకల్పిత గోళక మాళిపాళిస।
త్కరకరుణాలవాల గిరికార్ముకధార్మిక మానవావనా।
నిరుపమ సత్యనిత్యవర నిశ్చలతామహిత ప్రవర్తితా॥

కం॥ బ్రధ్నాబ్జవహ్నిలోచన।బుధ్నప్రజ్ఞాననిపుణ బుద్ధీశసఖా।
గృధ్నామరరక్షయహి।వృధ్న జగత్సృష్టివృక్షబుధ్న సులక్ష్యా॥

కందగర్భితమణిగణనికరవృత్తము॥

సురనరవరశివసురుచిర, వరణా।వరగుణ హరిశరవసుపతిశరణా।
స్మరహరభవహర సమరస, నిరతా।నిరుపమ పురహర నిజసుఖమహితా।

పృథ్వీవృత్తము॥ ముదాకర సదామరప్రకర మోక్షకృల్లక్షణా।
సదాశివ హృదంతర ప్రవణసచ్చిదామోదదా।
విదారణ సుదారుణప్రతిభ విక్రమాశుక్రమా।
నదీపతి సుదీపితప్రథిత నందితానారతా॥

మాలిని॥

సకలసుగుణజాలా సంవిదామేయలీలా।ప్రకటనిరత హేలా పార్వతీచిత్తలోలా।
సుకర సుజనపాలా శోభితాత్మైకఖేలా।నికట భజనశాలా నిర్మలామోదశీలా॥

గద్య.

ఇది శ్రీమదిమ్మానేన్యన్వయపయఃపారావార రాకాసుధాకరానవరత దేవబ్రాహ్మ
ణపూజావిధేయ దిగంతరాక్రాంతయశఃపరిపూరిత శ్రీ బాపనార్యపౌత్ర వీరే
శలింగనాయకపుత్ర శ్రీమద్గౌరీరమణచరణారవిందామందమకరంద
పానతుందిలేందిందిరాయమాణ శ్రీదక్షిణామూర్తి రామజోగి
గురుప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాచతు
రకవితావితానానూన వైభవ బుధజనవిరాజ
మాన శరభలింగాభిధానప్రణీతంబైన
యలంకారచంద్రోదయంబను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

శ్రీ మఖవ్రజ చరిత్రంబను నామాంతరము గల

# అలంకారచంద్రోదయము.

## తృతీయాశ్వాసము.

కం॥ శ్రీరంజితసచ్చిత్సుఖ। కారణసత్కారణవరకరుణారసహృ।
త్పూరణవారణకోణప। మారణమృగయాపురీశమంజులకోశా॥ ౧॥

తే॥ గీ॥ అవధరింపుము మునుమృకండాత్మజుండు। క్రోష్టికి కెఱిఁగించినట్లు సద్గోష్ఠినమరు।
జైమినికి నెమ్మనముకడుసంతసిల్లఁ। బక్షిరాజంబులిట్లు చెప్పందొడంగె॥ ౨॥

వ॥ అట్లమ్మఖవ్రజభూభుజుండా సుందరీతిలకంబుఁ దిలకించునెడ॥ ౩॥

చం॥ పదములనానియూరువులఁ బాఱినితంబమునాటినాభికన్ ।
బొదలివళిత్రయంబెనసి ముద్దిడి నిద్దపుటారుహత్తిపై।
నుదుటుగనున్న యున్నతపయోధరయుగ్మము నాక్రమించె న।
మ్మదవతిఁ జూచునా నృపకుమారుని మోహనదృష్టిజాలముల్ ॥ ౪॥

వ॥ ఇవ్విధంబున జవ్వనులనడుమ నివ్వటిలు నవ్వారిజాక్షి నీక్షించుచు జలధరతిర
స్కారణి వెలువడు నిండుచందురుని చందంబున లతావరణంబుఁ గడచి యక్కందర్పశతసుంద
రుండా సుందరీబృందంబు ముందర నిలుచునవసరంబున॥ ౫॥

సీ॥ ప్రకటాస్యచంద్రచంద్రికవోలె మొలకనవ్వొలుకువాని ముదంబుఁ గులుకువాని।
బలుసోయగమునఁ గల్వలతేనివలతేని మించువాని కడానిమించువాని।
హరినీలనీలాభ నలరారుమీసంపు లీలవాని పసిండిచేలవాని।
నరవిందములకు విందగుకన్నుఁగవ తళుక్కులొలయువాని సుకాంతి వెలయువాని॥

తే॥ గీ॥ హారకేయూరకటకకోటీరకుండ। లాగ్రిమాణిక్యధాగధగ్యములవాని।
నప్పుడమితేనివర్ష్మలోలాంతరంగ। లగుచుఁ గనిలేచి నిలిచి రయ్యబ్జముఖులు॥ ౬॥

కం॥ కలయ వెలుఁగొందు రుచిఁ జొ।క్కులమధ్యమునందు నిందుకళవోలె మరు।
ల్లలనారత్నంబనుఁ గుం।జెలువలలోనుండి వింత చెలువము దోఁపన్॥ ౭॥

చం॥ తమకమునబ్బురంబును ముదంబు నెదన్ గదియంగ నేత్రప।
ద్మములు ప్రఫుల్లముల్ సలలితంబులునై చలదృఙ్మిళిందసం।
ఘములను గ్రుమ్మరింపఁ గుచకందుకముల్ బులకింపఁ గాంచెఁ బ్రే।
మమలరనద్ధరావరకుమారుని నవ్యరమాకుమారునిన్॥ ౮॥

మ॥ తొలుకార్మించులసంచులై కువలయస్తోమైకదామంబులై।
బెళుకుంజేడిసమీలలీలలయి దీప్తిన్ ఖంజనాప్తంబులై।
తెలినెత్తమ్ములతమ్ములై తళుకులై దీవ్యచ్చకోరాళికా।
ళులునై యొప్పఁగఁ గప్పెనప్పుడు నృపాలుం బాలికాదృక్తతుల్॥ ౯॥

ఉ॥ వేలుపువాలుగంటిబొమవింటి విలోలదృగాశుగాళి భూ।
పాలు విశాలవక్షమునఁ బర్వఁగ నయ్యద నెంచియించువి।
ల్దాలుపుదంట వింటఁ బదిలంబుగఁ దుమ్మెదనారి మ్రోయఁ బ్రో।
యాలి పయింగడంగి కుసుమాస్త్రము లేయఁ దొడంగె నేపునన్॥ ౧౦॥

ఉ॥ కోరికలూరు నెమ్మొయి గగుర్వొడుచున్ గడకంటఁ దారకల్।
చేరి పరిభ్రమించుచునుఁ జెక్కులఁ జెమ్మటఁ గ్రమ్ము నెమ్మినో।
య్యారపుఁ జూపులజ్జఁ బెరయన్ మగుడున్ వలపూని క్రమ్మఱ।
న్నారెకు వెల్వడున్ నృపతినందనుఁ జూచు నెడన్బడంతికిన్॥ ౧౧॥

కం॥ ఈరీతిఁ గాంచి దివిష।న్నారీతిలకంబు రాజనందను నవశృం।
గారాకారమునకు నిం।పారఁ గడున్మెచ్చి చొక్కి యాత్మగతమునన్॥ ౧౨॥

సీ॥ తన కాంతి దరహాసమున నిల్పి భూవరుండగుచు వర్తించు సుధాంశుఁడొక్కొ।
తనదు పద్మాంబకత్వమును గన్నులఁ దాల్చి సాంగుఁడై మొనయు ననంగుఁడొక్కొ।
తన సౌరభము వక్త్రమున నించి నిజవిలాసముఁ జూపవచ్చు వసంతుఁడొక్కొ।
తన హరిడింభకత్వము మధ్యమునఁ బూని యవనికి దిగిన జయంతుఁడొక్కొ॥
తే॥ గీ॥ గాక యుండిన నీభువనైక మోహ।నాకృతియు నీశుభాంగక సౌకుమార్య।
మీయతులదివ్యతేజ మీమృదులశీల।మొనరుచుండునె యొందు నింకొకని యందు॥ ౧౩॥

చం॥ నరసురసిద్ధచారణఫణాధరఖేచరయక్షసాధ్యకి।
న్నరులకుమారులన్ జగమునన్బొడఁగాన మెవీని మేనివి।
స్ఫురణములోశతాంశమునుఁబోలఁగఁజాలుదు రేమరుందుమ।
త్పరిచరుఁడై మెలంగఁ డెయితండకటానను చెట్టవట్టినన్॥ ౧౪॥

మ॥ కరితుండంబులు బాహుదండములు శ్రీకారంబులౌ కర్ణముల్।
కురువిందాకృతి మోవి కీవినునుఁజెక్కుల్ చంద్రఖండంబులన్।
నిరసించున్ హరినీలముల్ నెఱికురుల్ నెమ్మేను మేలై వ్రేఁడియ।
ద్విరయీ ఱేనివరింపఁగల్గునవలా దేసుమ్ము భాగ్యంబిలన్॥ ౧౫॥

సీ॥ అనిమిషత్వంబుదన్యతనొందఁగావీని చెలువంబుఁగోరి వీక్షింపవలదె।
విమలగాంధర్వంబు వినుతికెక్కఁగవీనిపైని గీతంబులు పాడవలదె।
కులుకుగుబ్బలసారుగానబుమీరఁగవీని దృఢపరీరంభమర్థింపవలదె।
కమ్మకెమ్మోవిచొక్కఁపుఁజవుల్దగ వీనినునుఁజెక్కుగవముద్దుఁగొనఁగవలదె
తే॥ గీ॥ విలువఁదెలుపఁగరానియీతలిరుఁబ్రాయ। మొలసిఫలమందవీనితోఁగలసి మెలసి।
వలచివలపించితమిఁబెంచితలిరువిలుతు। కేళికలఁదేలినుఖలీలఁ గాలవలదె॥ ౧౬॥

కం॥ అనియిటులూహింపఁగఁదన। యనుఁగుంజెలులందు ప్రౌఢయైతగుకలవా।
ణినయమధురభాషలని। ట్లనియెన్జతురతదలిర్పనవనీపతితోన్॥ ౧౭॥

ఉ॥ అయ్యమరేంద్రనందనునియందమునందగుదీవునీదుపే।
రెయ్యదిమన్కియైనపురమెయ్యదియెవ్వరివాఁడవన్వయం।
బెయ్యదియిప్పుడెచ్చటికిఁ నేగుచునిచ్చటికేగుదెంచితో।
చయ్యనఁదెల్పుమిందరిహయసన్నిభవాహనలోకమోహనా॥ ౧౮॥

వ॥ అనియడిగికలవాణినిజవయస్యానుమతంబునరత్నపీఠంబొసంగిననందుసుఖాసీనుండైన నృపసూనుండిట్లనియె॥ ౧౯॥

ఉ॥ ఏనుమఖవ్రజాధిపుఁడనిందుకులుండగుశత్రుజిన్మహీ।
జానిసుతుండనొక్కముని జన్నముఁగావఁదలంచిమత్పితృ।
స్థానపురంబువెల్వడివెసన్జనుదెంచితదంతరాయకృ।
ద్దానవులన్వధించినఁబదంపడి యందొకరుండుఘోణియై॥ ౨౦॥

కం॥ కదసిమదీయనిశాత। ప్రదరాహతికరికియిటకుఁబఱతెంచిగిరీం।
ద్రదరిన్గను మొఱఁగిననే। వెదకుచునిటువచ్చినాఁడవినుమబ్జముఖీ॥ ౨౧॥

వ॥ అనిమఱియునద్ద్విజకాంతారత్నంబునుద్దేశించియిట్లనియె॥ ౨౨॥

శా॥ శ్రీవాణీగిరిజాశచీరతులధాత్రిన్వెందుమబ్బోటుల।
న్నీవామాక్షి యొకర్తుగామదికినెంతేసందియంబయ్యెడు।
న్భవంబేర్పడనాకుఁదెల్పుముశరత్పూర్ణేందుబింబాననా।
యీవిద్యుల్లతికాంగిజన్మకథనంబీబాలికానామముక్॥ ౨౩॥

కం॥ అనవుడురాకొమరునకి। ట్లనియెన్గలవాణికాననగునిదెమత్ప।
త్తనముకమలావిలాసం। బనుపేరనశేషసంపదావాసంబై॥ ౨౪॥

సీ॥ ఏవంకఁగనుఁగొనహేమమయోద్దీప్తసుందరతరములౌమందిరములె।
యేదారిఁవీక్షింపనిభకుంభమౌక్తికతోరణాళిప్రభాపూరితములె।
యేచాయఁజూచిననినమండలావృతధ్వజచామరచ్ఛత్రవరణతతులె।
యేమూలఁబొడఁగన్నశ్రీమించుదీర్ఘకాప్రాకారగోపురప్రాంగణములె।
తే॥ గీ॥ యెందుఁబరికింపనందితానందవనము। లెటులఁదిలకింపనద్భుతభటనికాయ।
మేమిచెప్పుదుఁగమలాఖ్యనెసఁగునట్టి। పురమునందుననిందుప్రనిపురముఁబోలి॥ ౨౫॥

వ॥ మఱియును॥ ౨౬॥

సీ॥ అచటిభూసురకోటియఖిలవిద్యాధాటిఁగమలజుమెచ్చనివిమలమతులు।
నచటిక్షత్రియజాతియతిశౌర్యవిఖ్యాతిఁబరశురామునినైనసరకుసేయు।
దచటికోమట్లలకాధినాధునకైనధనరాసులిచ్చెడిధన్యతములు।
నచటినాలవవారుసుచరిత్రగుణభూతిబ్రాహ్మణభక్తిచేఁబ్రబలువారు॥
తే॥ గీ॥ నచటివేశ్యాంగనల్మించునట్టినాట్య। మందురంభాదులనుఁదీవినిండఁజేతు।
రచటిశాలములుసస్యోన్నతాప్తిఁజెలఁగు। నచటిసకలవస్తువులుననర్ఘ్యమణులు॥ ౨౭॥

మ॥ కలఁడేతత్పురనేతయాతతసమాఖ్యాబాలికాకేళికా।
నిలయీభూతజగత్త్రయుండఖిలవిజ్ఞేతృస్తుతాత్మీయరా।
జ్యలసచ్ఛ్రీనిధివారితారిహిమతేజోఖండమార్తాండమం।
డలుడుండున్పురజిత్సమాహ్వయుఁడుగంధర్వాధినాధుండిలన్॥ ౨౮॥

చం॥ అతఁడుశుభాంగినాఁబరగునాత్మసఖీమణితోడఁ జేర్మిమై।
నతులితభోగవైభవమునందుచుమున్నొకనాఁడుకేళికాం।
చితవనులన్నదీపులినసీమలసత్కృతకాద్రికందరా।
యతనములన్ముదంబునవిహారముసల్పుచునేగదవ్వులన్॥ ౨౯॥

సీ॥ లేమిఁబాపఁగనోపులేమపుట్టినయిల్లుపాఁపపానుపుసౌనిపడకటిల్లు।
చేసిమ్రాకులనీనుపేరైనయెలదోటమైనాకుఁగాచినమరువుకోట।
వెలలేనిమానికంబులపెన్నిధానంబుబహుసుధాహారులపానసంబు।
హరిదిభంబులకేళికలరుకేళాకూళిజలధరావళిపానసదనపాళి॥

తే॥ గీ॥ పంటకలువకంటిగంటలయొడ్డాణ।మమితమకరమత్స్యకమఠకర్క।
టాదివాశ్చరములకాస్పదమగుచోటు।కలశజలధియెదుటఁగానవయ్యె॥ ౩౦॥

కం॥ పాడఁగనితత్తీరంబునఁ।బుడమిపడంతుకపిఱుందుపోలికఁగన్ప।
ట్టెడునొకయున్నతపులినము।కడనిలిచియతండుదెలిపెఁగామినికెలమిన్॥ ౩౧॥

మ॥ అమరశ్రేణులకోఁగిరంబునిజకన్యారత్నమున్శారిక।
య్యమరాధీశునకున్సితాశ్వగజముఖ్యంబుల్పయోదాళికు।
త్తమవాజీవనమిట్లొసంగుటఁజుమీదాల్చెన్యశంబీసము।
ద్రమువిష్వక్చలదూర్మికానికరనిర్యత్ఫేనదంభంబునన్॥ ౩౨॥

మ॥ చటులాంతర్జ్వలదౌర్వకీలములవెచ్చంద్రాఁగికూలంకషో।
త్కటదుగ్ధంబుగఁబొంగెనాగగనవాతక్షిప్తకల్లోలవి।
స్ఫుటవేగంబుననీపయోంబునిధినుబ్బున్మీగడల్మింటిచ।
క్కటికిన్జిడ్డెతిఁగించువాసనలతోఁగంటేకురంగేక్షణా॥ ౩౩॥

సీ॥ మథనవేళాభ్రమిమన్మందరత్వరఁబూనితెరలకున్నవివోలెఁదిరుగుసుళ్లు।
పైనున్నహరితల్పఫణిమేనిమడతలవడువుననిడుదలయ్యెడుకరుళ్లు।
పరిభవించుతటినచ్చరలవిలోకనలోలతలనభ్యసించెనాబెళుకుమీలు।
తారలపొందుఁబొందఁగఁబోలెమిన్నందుకల్లోలధుతపయఃకణచయంబుఁ॥

తే॥ గీ॥ దనరతావకముఖచంద్రదర్శనప్ర।భూతకౌతూహలంబునఁబోలెనతివ।
తెరలియుప్పొంగెరవమునఁదేజరిల్లి।పాండురుచుతెల్లకడఁజల్లిపాలవెల్లి॥ ౩౪॥

కం॥ తమముడిపికువలయానం।దముసంధిలఁజేసిసత్పథక్రమణవిలా।
సముఁగనిసర్వజ్ఞవతం।సమయినరాజిందునూవెజనియించెఁజెలీ॥ ౩౫॥

వ॥ అని ప్రియాంగన కెఱిఁగించుచు నగ్గంధర్వవిభుండనతిదూరంబున॥ ౩౬॥

శా॥ ఆనందంబునఁ గంఠదేశవినిబద్ధాన్యోన్యహస్తాబ్జులై।
నానారత్నవిభూషణప్రభలు సంధ్యారక్తిమంబూన్ప నె।
మ్మేనిగ్గుల్చపలాసితాంబుదముల న్మేలంబులాడంగ ల।
క్ష్మీనారాయణు లిర్వురు న్విహరణక్రీడావినోదంబునన్। ౩౭॥

తే॥ గీ॥ మెలఁగుచుండఁగ నబ్బురంబలరఁ జూచి। తానుఁ దన కూర్మిబోటియుఁ దత్పదాబ్జ।
ములకుఁ బ్రణమిల్లి భక్తినంజలులు ఫాల। తలములఁ ఘటించి వినుతించి రెలమి నిట్లు॥ ౩౮॥

భుజంగప్రయాతము॥ నమస్సర్వలోకైకమాతాపితృభ్యాం।
నమశ్చంపకేందీవరాభాంగకాభ్యాం।
నమో దేవదేవాదిసంసేవితాభ్యాం।
నమో దివ్యరుగ్భ్యాం నమశ్శ్రీహరిభ్యాం॥ ౩౯॥

వ॥ అని మఱియు నయ్యాదినారాయణు నుద్దేశించి యిట్లనిరి॥ ౪౦

దండకం।

శ్రీమజ్జగద్రక్షణాక్షీణదీక్షాభృదీక్షాసమంచత్కటాక్షా స్వపక్షామరక్షేమకృత్తా
ర్క్ష్యదక్షా విపక్షోరురక్షోగణక్షోభకృద్విక్రమానీడజేంద్రక్రమా యిందిరాసుందరీహృన్న
ళేందిందిరా మానిభాస్వన్మనోమందిరా బాహుపీఠాంగదామందరత్నీభవన్మందరాసుంద
రాకార గోవింద దామోదరా చారుమందస్మితోద్యన్మరందావృతాస్యారవిందా ముకుం
దా శతానందసంక్రందనాద్యర్చితాంఘ్రిద్వయా భక్తరాజీవరాజీవబంధూదయా మం
డితాఖండలోద్దండవేదండశుండాభదోర్దండదీప్యద్గదాశంఖచక్రాసి శార్ఙ్గప్రభాహారి
శౌరీ మురారీ హరీ మత్స్యకూర్మాద్యనంతావతారా శతారాబ్జతారా సుధారశ్మిమందార
డిండీరహీరాదిరాజద్యశఃపూరకర్పూర కాండప్రపూర్ణత్రిలోకీకరండా మహాఖండవే
ఖండభాండప్రకాండాధివాసత్రిచండా ప్రచండోష్ణరుఙ్మండలీమధ్యవర్తీ హృషీకేశ
సర్వేశ దేవేశ చిత్కేశ విశ్వేశ శశ్వత్ప్రభా శాశ్వతా మేయ విశ్వంభరా నీమ
హత్త్వంబచింత్యంబవద్యంబఖండంబభేద్యంబసంగంబబోధ్యంబబాధ్యంబువాఙ్మాన
సాగోచరంబవ్యయా భవ్యసేవ్యాగుణాతీత సర్వాత్మకా నీకచంబుల్మహామేఘముల్లోక
నాధా సుధాభానుభానుల్ భవన్నేత్రముల్ శేషదృక్కర్ణతల్పాకకుబ్భాగముల్నీకుఁగర్ణం
బులంభోజనాభా కృశానుండు నీమోము నారాయణా శారదాదేవి నీజిహ్వ సౌవర్ణకౌశేయ

ధారీ భవత్ప్రాణమెన్నం జగత్ప్రాణమస్తోకవక్షస్స్ఫురత్కౌస్తుభా - సాగరంబుల్భవద్గర్భ గోళంబులం భోజపత్రేక్షణా యంతరిక్షంబునీ నాభికాక్రోడమీశా త్వదీయోరుపాదం బులీభూతలంబచ్యుతా నీశరీరంబువిశ్వంబు భూతాంతరాత్మా సముద్రంబునందూర్మి కాబుద్బుదశ్రేణిచందంబునం దేవతిర్యఙ్నరాదిప్రపంచంబు నీయందసర్గప్రవృత్త్యంతము ల్గాంచుచుండు న్జగన్నాటకప్రక్రియాసూత్రధారీశిఖావంతుఁడిధ్మంబులందున్న మాడ్కిన్మ నోబుద్ధిదేహేంద్రియాద్యేకసంద్రష్టవై ప్రాణులందెల్లడన్జీవసంజ్ఞన్బ్రవర్తింతువీ వేకదా స చ్చిదానందరూపా జితక్రోధమోహుల్సమస్త్యాగమార్గజ్ఞులధ్యాత్మనిత్యు ల్వివిక్తస్థలాసీను లాచారవంతు ల్మునుల్నిన్నువీక్షింతు రాదిత్యచంద్రాగ్నితారాతటిత్పద్మ తేజోచ్ఛటం దేజం బువాటింపగాఁజాల వెద్దాని ధీరుల్ప్రవేశించి భూయోభవప్రాప్తి లేకుందు రచ్చోటునీది వ్యథామంబు నీతత్త్వమెవ్వారికైనం నిరూపింపశక్యంబుగాకుండు మేమేమివర్ణింపఁగానే ర్తుముద్యద్దయాదృష్టినీక్షించి రక్షింపు మోభక్తచింతామణీ దైవచూడామణీ వాసుదేవా నమస్తే నమస్తే నమః॥ ౭౧॥

సీ॥ అనియిట్లులక్ష్మీసమన్వితుండగు నాదినారాయణునిజగన్మాన్యచరితు।
నమరుగద్గదికతోహర్షాశ్రుపూరితనేత్రులై పులకితగాత్రులగుచుఁ।
బ్రస్తుతింపుచుపునర్వందనంబులొనర్చునతులగంధర్వదంపతులభక్తి।
పారవశ్యమునకపారకృపాస్వాంతుఁడై హరిభవదీప్సితార్థ మెద్ది॥

తే॥ గీ॥ యనినవారలురమఁబోలునట్టిపుత్రినంగభవుఁబోలుపుత్రునిమ్మనుచు వేఁడ।
నట్లయగుననివరమిచ్చియంబుజాక్షుఁడప్పుడంతర్హితుండయ్యెనతివతోడ॥ ౭౨॥

వ॥ అనంతరంబాపురజైత్రుండునుందనయింతియునత్యంతసంతోషితస్వాంతంబు లతోమగుడనిజపురంబుం బ్రవేశించిసుఖంబుండిరంత॥ ౭౩॥

కం॥ జానగుతమినయ్యిరువురు। నానావిధమదనతంత్రనవ్యసుఖశ్రీ।
తోనిరవొందుచునుండం। గానవ్వేలుపువెలందిగర్భముఁదాల్చెన్॥ ౭౪॥

కం॥ నెలదప్పెవింతచిన్నెల। నెలవగునెలఁతుకకునిండు నెలవెన్నెలవ।
న్నెలగెలుచుదెలుపుచెక్కుల। నెలకొననవిచంద్రశకలనియతిన్దనరెన్॥ ౭౫॥

మ॥ నవగర్భోదయవేళయన్తొలుకరిన్మందంబులై హంసయా।
నవిశేషంబులుడిందెనూర్పుగములన్వ్యాజంబునందూర్పుగా।
డ్పువెసన్వీచెఁబయోధరంబులొగినుప్పొంగెన్వినీలంబులై।
నవకంబేర్పడెమించెఁజిట్టుములుసోనల్గాఁగురంగాక్షికిన్॥ ౭౬॥

కం॥ వళులవశేషితరేఖా। వళులయ్యె న్నెఱుఁగుటారు ప్రకటంబయ్యె।
న్దలమయ్యె నుదరమింతికి। నలసటయును నిదురయ రుచియధికములయ్యెన్॥ ౪౭॥

తే॥ గీ॥ మున్ను కటికోడి సూక్ష్మమైయున్న కలికి। కాను చూలింత తనము రాఘునతఁ గాంచి।
దాని నెదురించెఁ జితుఁడైన హీనబలుఁడు। బలము సమకూడు తఱి వైరి గెలుచుఁ గాదె॥

చం॥ చల్లని తమ్మి తూండ్లకిరియఁ జల్వవహించిన చేతులన్విభు।
న్నెల్లనఁ గౌఁగలించు మనుప్రమింగిన కమ్మని నోరమోవిన।
ల్లలన నానుఁ గాంక్షితరతాదులకున్ మదిఁ గొంకి ప్రార్థనా।
భ్యుల్లసదుక్తులైయెయుబుసువుచ్చుఁ బ్రియు న్జెలియప్డు గ్రీడలన్॥ ౪౯॥

చం॥ నెలలొగి నిట్లుఁ దొమ్మిదియు నిండఁగ నెమ్మదిఁ బుణ్యభామిను।
ల్బలుముద మొందనొక్క శుభలగ్నమున న్దరలాక్షి గాంచెన।
క్కలువల ఱేని నిందిరను గాంచిన దుగ్ధపయోధి వీచికా।
తిలకమురీతి వేల్పులు నుతింపఁగ మాఱుఁగుమారికామణిన్॥ ౫౦॥

మ॥ వెలుఁగొందెన్దివిఁ దారకాగ్రహముల వ్వేళన్నరద్వేళను౧।
బలె సాంద్రంబుగ దేవదుందుభిరవవ్యాజైకగర్జాసము।
జ్జ్వలకల్పప్రసవప్రవర్షమొదవెన్ సౌరభ్యయుక్తామారుతం।
బులువీచెన్నటియించె నచ్చరలగుంపుల్సొంపు దీపింపఁగన్॥ ౫౧॥

తే॥ గీ॥ అపుడు పురజైత్రుఁడమిత హర్షాంబురాశిఁ। దేలి పుత్త్రోత్సవ మొనర్చి ద్విజతతులకు।
రత్నకాంచన భూషాంబరములనొసఁగె। మంగళాశీర్వచోవిభ్రమంబులలర॥ ౫౨॥

తే॥ గీ॥ అఖిలజగదీశుఁడైన పద్మాయతాక్షు। వరమహిమ చేజనించుట వలన నక్కు।
మారునకు ధీరతను నలంకారచంద్రుఁ। డనుచుఁ బేరిడె నతఁడతిహర్షమెసఁగ॥ ౫౩॥

కం॥ కళలభ్యసించి చంద్రుని। కళభంగి మనోజ్ఞరూపకాంతిస్ఫురణ।
న్వెలయు నిదియనుచు జనకుఁడు। కళావతియటంచుఁ బేరు కన్నియకొసఁగెన్॥ ౫౪॥

మ॥ పాలుపొన్దజలకంబులార్చి జిలుఁగున్బొత్తిళ్లలోఁ జేర్చి త।
ళ్ళులరాగిల్లు పసిండిగిన్నియల నుగ్గుల్వోసి కన్దోయిఁగ।
జ్జలము న్గస్తురిఫాలమందునిడుచున్నజ్జిచ్చియమ్ముద్దుపి।
ల్లలమేల్బంగరుతొట్టెలందునిచి జోలల్వాడి రాళీమణుల్॥ ౫౫॥

కం॥ ఇంతులిటులూడిగముల। శ్రాంతంబు నొనర్ప రూపసంపన్నత చే।
నెంతయు బాలామణియం। తంతన్బాలేందు రేఖయట్లుగ నెగడెన్॥ ౫౬॥

కం॥ చెలువలమంజులహస్తాం గుళులూఁతగ బాలకేలఁగొనుచునుజితిము।
వ్వలరతనపుఁగడియమ్ములు। సులుసుల్లననడుగులిడుచుఁగన్నియ మెలఁగున్॥ [illegible]॥

తే॥ గీ॥ ముదితమేడలదాఁగుడుమూఁతలాడు। వేళనందలిభర్మపాంచాలులందుఁ।
దానొకటియై చెలంగనత్తరుణినచట। వెదకికొనలేక చిన్నఁబోవుదురు చెలులు॥ [illegible]॥

చం॥ పలురతనాలతిన్నియల బాలిక ఖేలనలీలబొమ్మరి।
ల్లిలిపిప్రియంబు తాచవులనిండినగుజ్జనగూండ్లవిందులం।
బొలుపగు వేడ్కతోనొసఁగి బొమ్మలపెండ్లి యొనర్చివియ్యము।
లెల్లఁదులతోడనందునొక వేళశుభావహలక్షణాంగియై॥ [illegible]॥

సీ॥ ధృతమనోరథబృందబృందారకమరాళగమనలు మందయానములు నేర్పఁ
విబుధేంద్రనుతవిద్యవిద్యాధరసుధారసాధరల్సాహితీబోధ మొసఁగ।
ఘనజగన్మోహనగాంధర్వగాంధర్వకామినుల్సంగీతకళలు గఱపఁ।
భవ్యగీత్యనుభావభావప్రభావాప్సరస్సతుల్నటనవిభ్రమముఁ గూర్ప॥

తే॥ గీ॥ మునిపురంధ్రులునిగమార్థముఖ్యనియమ। ములనెఱింగింపనన్నింటవలఁతియగుచుఁ।
బలుకుముద్దియకుద్దియై వెలయుచుండుఁ। జెలుతతనమునఁ జెలులెన్నఁ జెలువమిన్న॥

తే॥ గీ॥ బాలయౌవనవేళవిరాళినివియు। నేచకుండఁగనప్పటికిపుడె చెలిమిఁ।
బాలనము సేయుననవాటపాటలెల్ల। బక్షిశుకశారికలకు నేర్పఁగఁ దెలుపు॥ [illegible]॥

కం॥ వెళికెడు చూపులనమృతము। చిలికెడువచనములమిసిమిఁజెందిమొలకలై।
కులికెడు తేఁజన్నులసిరు। లొలికెడు నెలఁబ్రాయమప్పుడు విడఁదోఁచెన్॥ [illegible]॥

సీ॥ పాణిపాదాధరపల్లవంబులరక్తి పెనుపొందఁగలకంఠసినద మొసఁగఁ।
దోరంపు మెఱుఁగులఁదోర్లతల్క్షానసాఁగనభినవోత్కలికనొయ్యనఁదనర్ప।
సరసంపు నెఱిగుబ్బవిరిగుత్తులిరవొందమందాక్షవృత్తసంపదలు ప్రబలె।
దరహాసరుచిమరందపుసోనఁజిలుకంగభ్రమరకంబులుసువిభ్రమముఁ దాల్చె॥

తే॥ గీ॥ మృదులశుకవాగ్విలాసంబువొదలసతను। భాసురాంబకములుచలత్ప్రభలఁ దాల్చె।
నతివతనువనుమనసిజోద్యానవనము। నందునవ్యవసంతాగమమున॥ [illegible]॥

వ॥ ఇట్లధిగతాగణ్యతారుణ్యలావణ్యాదీపితరూపకలాకలాపంబులనొప్పెడు నాఁటఁ
గన్నియ సిద్ధ విద్యాధరప్రముఖసభికాకీర్ణ సౌవర్ణసభాభవనసదస్యపదంబున నాసీనుం
డగు జనకుని సన్నిధానంబున సహజస్ఫురదురుచిరలంకారసంప్రసారితంబుగ నున్నయవసర

రంబునం దివినుండిదివిజగురుండచటికరుదెంచిన నతనిసముచితసత్కారంబుల నారాధించి సుఖోపవిష్టుంగావించిపురజైత్రుండగ్గురుచరణంబులకుఁదనముద్దుబిడ్డలఁజేయివట్టిమ్రొక్కించియిక్కన్నియకేయేలక్షణంబులుగలవరుండులభించునీయలంకారచంద్రుండెట్టిప్రభావంబుగలవాఁడగుననియడిగిననాశుభప్రశ్నంబులకుంగొండొకతడవూహించిసముచితమనీషావాక్పతియగు నవ్వాక్పతి గంధర్వపతికిట్లనియె॥ ౬౪

మ॥ వనజాతాక్షువరప్రభావముననివ్వామాక్షిజన్మించెఁగా।
పునభూమండలభర్తయైసిరులకున్ప్రోవైగుణాంబోధియై।
దనుజార్యంశజుఁడైసువిక్రమయశోధారేయుఁడౌనొక్కచ।
క్కనిమర్త్యేంద్రుఁడునీనికివ్విభుఁడగున్గంధర్వరాజోత్తమా॥ ౬౫

వ॥ మఱియు లక్ష్మ్యంశసంభవయగు నిక్కళావతీసతీమతల్లికిసహజన్ముఁడగు నీయలంకారచంద్రుండు ప్రథమభవంబున దేవదానవు లమృతంబునకైక్షీరసాగరంబుమందరధరాధరంబుచే నమందగతిమథించుతఱియందబ్జాలయయగు నిందిరాదేవికిందోఁబుట్టువై యబ్జుండనునామంబుననుద్భవిల్లి రోహిణీపతియనవిశ్రుతింబొంది నిశాధినాథుండైవర్తిల్లె. ద్వితీయభవంబున నత్రియనుమహర్షికి ననసూయాదేవియందు హరిహరులయంశంబులంబ్రభవించిన దూర్వాస దత్తాత్రేయులతోఁబుట్టువై బ్రహ్మాంశంబునఁజంద్రుండనుపేర జనియించి నావలనసకలశాస్త్రంబులభ్యసించి యింద్రియలోలత్వంబున బాల్యవశంబునం జేసినాకపకారంబుఁగావించితారాప్రియుండైయుడుపతియనంబ్రసిద్ధివహించె. నీతృతీయజన్మంబునవిశ్వరూపుఁడగు శ్రీమన్నారాయణువరదానంబునం జేసి తత్సంకల్పవశంబున "చంద్రమాహృదయేజాత" యనువాక్యానుసారంబుగనీకళావతీసతికిననుజన్ముండైనీకుంజన్మించె నీగంధర్వలోకంబుసత్పథాధిష్ఠితంబెగావునగగచరుండైకువలయాధినాథుండనంబ్రఖ్యాతింబొందుమఱియును॥ ౬౬

సీ॥ కవిచకోరకదంబకంబులానందించువిమతాననాబ్జపాళిముకుళించు।
లలిమిత్రకువలయంబులువికాసమునొందుఖలజనచక్రవాకములుగుందు।
బంధుబృందానందసింధువులుప్పొంగుఁగనదధర్మధ్వాంతగతులడంగు।
సత్సంతతులకభీష్టార్థంబులిరవొందుఁగుమతిచోరప్రచారములుడిందు॥
గీ॥ నవనిఁబొగడొందుఁబరమసౌహార్ద్రహృదయుఁ।డమితదరహాసచంద్రికావిమలుఁడాప్త।
భూరికరుణాసుధారసపూర్ణుఁడగుచు।సత్పథాప్తినలంకారచంద్రుఁడలరు॥ ౬౭

చ॥ అనివాచస్పతిమున్నభావిశుభవాక్యారూఢివాక్రుచ్చియా।
త్మనివాసంబునకేగెనప్పలుకులత్యంతప్రమోదంబున।
న్వినియిక్కన్నియనాఁటఁగోలెసురలన్వీక్షింపదయ్యక్షునం।
దనులంగోరదుమానసంబిడదుగంధర్వాదులందున్దమిన్॥ ౧౮॥

కం॥ జననాథాగ్రణియైసు।జ్జనవినుతచరిత్రుఁడైనచక్రినరపా।
లునివరియించెదనని నె।మ్మనమునననయముఁదలంచుమానినినెమ్మిన్॥ ౧౯॥

శా॥ ఆగంధర్వకుమారియాచెలివయస్యల్వీరలిచ్చోట హా।
నచ్చెగన్పట్టెడురత్నసౌధములుశుద్ధాంతప్రదేశంబులీ।
శ్రీగంధామ్రమధూకకల్పసుమనోరింఛోళికాసంగిభృం।
గీగానోపవనీనికుంజచయముల్ క్రీడావిహారస్థలుల్॥ ౨౦॥

కం॥ అనుచుఁగలవాణికన్యా।జననాగతియుంవదీయసద్వాంఛితము।
న్వినయమునఁదెలుపఁబురజి।త్తనయామణినధిపుఁడాత్మధనముగఁదలఁచెన్॥ ౨౧॥

చ॥ తలఁచినశేంద్రుఁడప్పుడుముదంబుననచ్చెలితోడవెండియుం।
బలుకుశుభవాదృశత్రిదశభామినులందిలకించిమాకు।
మీకలితవిపంచికామధురగానసుధారసధారవీనుల।
న్నెలకొనముచ్చటించుటలునేఁడుగదాగలిగెన్దలోదరీ॥ ౨౨॥

తే॥ గీ॥ అనిననవ్విభుహృదయమావనజనయన।భావమునెఱింగికలవాణిపలికెనిట్లు।
లోకనాయకనీదగురాకవలన।నధిగతాభీష్టయయ్యెమాహంసయాన॥ ౨౩॥

కం॥ పురుషోత్తమనీసన్నిధి।పరిపూర్ణములుగమదీయభాగ్యములెల్ల।
న్వరుసఫలింపనొనర్చె।న్వరశోభమదీయపద్మపాణికిఁగూర్చెన్॥ ౨౪॥

కం॥ కావునమునుదేవగురుం।డేవెరవుననానతిచ్చెనిపుడదిసఫలం।
బైవెలయుశుభముతతిరా।దైవంబనుకూలుఁడగుచుఁదానెఘటించున్॥ ౨౫॥

చం॥ ధరణినృపాలకోటికవతంసమవీవు నెలంతలందుభా।
స్వరగుణరూపశీలములవన్నియకెక్కెత్రిలోకసన్నుత।
స్ఫురితకళావిశేషములఁబొల్పగునీపురజిత్కుమారిమీ।
యిరువురఁగూర్పఁడేని, విధినెంతురెవేల్పులువేల్పుపెద్దఁగన్॥ ౨౬॥



శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

శ్రీ మఖధ్వజ చరిత్రంబను నామాంతరము గల

# అలంకారచంద్రోదయము.

## చతుర్థాశ్వాసము.

కం॥ శ్రీగౌరీకుచకుంకుమ। రాగోద్భాసితసువక్షరమణీయమహా।
భోగీంద్రభూషసంహృత। యాగామృగయాపురీశయఘుచయనాశా॥ ౧॥

తే॥ గీ॥ అవధరింపుముమునుమృకండాత్మజుండు। క్రోష్ఠికెఱిఁగించినట్లుసద్గోష్ఠినమరు।
జైమినికినెమ్మనముకడుసంతసిల్లఁ। బక్షిరత్నంబులిట్లుచెప్పందొడంగె॥ ౨॥

కం॥ ఆవిధమునమణిగృహమున। నావిభుతోగోష్ఠిసల్పియచటఁదదనుసే।
వావిధిభృత్యులనునిచిని। జావాసంబునకుఁబురజిదాహ్వయుఁడరిగెన్॥ ౩॥

ఉ॥ పిమ్మటనమ్మహీవిభుఁడుపెల్లనురాగముతోడవేలుపుం।
గొమ్మనునెమ్మదిందలఁచికొంచుఁగనుంగొనలందునశ్రువు।
ల్గ్రమ్మఁగనమ్మణీభవనరంగమునన్గలయంగవేమఱుం
గ్రుమ్మరునమ్మరుండుపలుకుజ్జిలుకుల్బలుకిన్కనేయఁగన్॥ ౪॥

సీ॥ లలితపంజరశుకాలాపములివ్వనసైననతివపల్కులటంచునాలకించుఁ।
గాంచనపాంచాలికాశోభగనసైనబాలికాకృతియంచుభ్రమవహించుఁ।
బటువజ్రముకురబింబములచాయలఁజూచిముదితాస్యరుచులంచుమదిఁదలంచుఁ।
గురువిందకుట్టిమసరణులారసియోషిదంఘ్రిలాక్షాంకంబులంచునెంచుఁ॥
తే॥ గీ॥ జిత్రభిత్తికఁదద్రూపచిత్రలీలఁ। గాంచిక్రొమ్మించుబోఁడినీక్షించి[illegible]నిపు।
డంచుడాయఁగఁగమకించుఁబంచబాణ। బాణధుతధైర్యుఁడగుచుభూపాలసుతుఁడు॥ ౫॥

చం॥ అసదృశకల్పపాదపఫలాతిరసాద్యములెల్లజాళువా।
వెసలలనుంచియూడిగపు వేల్పువెలందులు దెచ్చియిచ్చిన।
న్నెసవఁడువేఁడికొన్నబలిమిన్జవిఁజూచునుగానిచూడఁడిం।
పెసఁగఁగముచ్చటాడఁడుమహీపతితద్విరహార్తచిత్తుఁడై॥ ౬॥

తే॥ గీ॥ అనిశముతదీయనిశ్చలధ్యానయుక్తి।నలయున్నృపునకుబహురూపములఁబ్రసన్న।
యయ్యెమోహనలక్ష్మీనానప్పుడెల్ల।కడలలో వెలిఁగనుపట్టుకలికిరూపు॥ ౭॥

వ॥ ఇట్ల మిత వేదనాచలితహృదయుండైన్నృపతనయుండునిజాంతర్గతంబున॥ ౮॥

సీ॥ తొలిజన్మములనునెచ్చెలులేమినోములునోచిరో చెలిచెల్మిమోచియుండ।
రతనాలపీఁటెయెట్టితపంబుసల్పెనో బాలికచేపట్టుఁబాయకుండ।
సుమణిహారంబులేసుకృతంబొనర్చెనో కాంతాకుచాగ్రభాగములమెలఁగ।
సదనదర్పణములేసద్విధుల్ చేసెనో ప్రమదానుబింబభాగ్యములుగలుగ॥

తే॥ గీ॥ నిచటిమణిచిత్రసౌధంబులిచటితమ్మి।కొలఁకులిచ్చటియుపవనీకుంజతటులు।
నెట్టియుపకృతిఁగావించియొసఁగెనొక్కొ।రమణికేళీవిహారసంప్రాప్తినొనర॥ ౯॥

చం॥ అలచెలియూరురంభలభుజాచ్ఛబిసంబులహాసచంద్రికన్।
బలితపుగబ్బిగుబ్బవిరిబంతులఁజెక్కులికప్పురంపుబి
ళ్లలజిగిమోవిపానకములందనివొందినఁగాకయేక్రియ।
న్దలమగుచున్నయివ్విరహతాపభరంబుశమించువాకిఁకన్॥ ౧౦॥

చం॥ చెలిదలపువ్వుచంద్రునిగఁజెందిరపుందిలకంబుఫాలమం।
దలిసెగకన్నుఁగానెదఁగనంబడుహారములన్భుజంగభూ।
షలుగజటన్గపర్దముగసారెదలంచిగిరీశభీతిచేఁ।
గలఁచుటమానినన్నొకనిఁగ్రాఁచుటయోవలరాయ?న్యాయమా॥ ౧౧॥

ఉ॥ ఎన్నఁడుకన్నులారఁదరళేక్షణఁగ్రమ్మరఁగాంతుఁగాంచియ।
య్యన్నులమిన్నతోడనెనరానఁగముచ్చటలాడిమోవిమేల్।
జున్నలుగ్రోలిమక్కువలఁజొక్కుచుఁగౌఁగిఁటగారవించుచు।
న్గ్రొన్ననవింటివానిబలుకూటమినెన్నఁడుగూడఁగల్గునో॥ ౧౨॥

కం॥ అనియిట్లుమోహవివశత।మనుజాధిపనందనుండుమణిమయసదనం।
బుననుండెనిటఁగళావతి।యునుదదధీననిజమానసోత్కటవృత్తిన్॥ ౧౩॥

తే॥ గీ॥ ప్రాణసఖుల వింతపడఁతులుగాఁ జూచు। పలుకరింప దెలమి చిలుకనైనఁ।
జెదరుకురులఁ జక్కఁ జేయదు మైమర। పూని నిలుచుఁ జింత నుస్సురనుచు॥ ౧౪॥

మ॥ మృదుమధురోపహారము లాకించుక వాచవిఁ గైన మోవిఁ జే।
ర్పదువరపారిజాతసుమవల్లరులంటదు కేలనైనఁ జూ।
డదు కడకంటనైన నెదుటందగు పంకజపాళిమైనలం।
దదుఘనసారసాంకవకదంబమునంబుజనేత్ర చింత చేఁ॥ ౧౫॥

సీ॥ హృదయస్థితానంగుఁ డెదనేయములు కుల మొనలు పైఁదోఁచెనా మొలచెఁ బులక
లానంగశిఖికిఁ దోడై వచ్చు కమ్మవీవదులనవలపుటూర్పులు జనించెఁ।
దద్వాతనిహతిచే తవియోగజలధియుప్పొంగనాఘుర్మాంబుపూర మొదవె।
నానీటి వెల్లిపైనలముడిండీరకాంతులు నాఁగ నెమ్మేనఁ దెలుపువొడమె॥
తే॥ గీ॥ తెలుపునకుఁ దోడు నీడలై వెలయు హార। కలితమౌక్తికములు పెనుగాకఁ గ్రాఁగి।
బాష్పధారలఁ గరఁగి పైపైనఁ గ్రమ్మ। కొమ్మ సాలిండ్లమరె వెండికొండలట్లు॥ ౧౬॥

కం॥ అనిశధ్యాతనృపతినం। దనవదనేందురుచిమరుప్రతాపప్రభచే।
తనునర్థముకుళితములై। కనుదమ్ములు తనరె నమరకామినికంతన్॥ ౧౭॥

ఉ॥ వారకస్రుక్కఁ బాహుబిసవల్లులు వాడెఁ గుచాబ్జకోశము।
ల్గోరపుఁగంకణావళులతోడ నెజాఱె సమంచితోర్మిక।
ల్సారెగలంగె జీవనము శ్వాసమహోష్ణసమీరవారవి।
స్ఫారగతిన్వియోగవసువర్తి దినంబునఁ జారువేణికిన్॥ ౧౮॥

కం॥ సొగసగు చనుబంతులపై। జిగిదగు మగరాలసరులు చెలి సాంజననే।
త్రగళజ్జలములఁ జుయ్యని। పొగ లెగయఁగ నింద్రనీలములసరులయ్యెన్॥ ౧౯॥

ఉ॥ నూతనమండలీకృతధనుర్లతికాపరివేషధారిసం।
ఘాతతహృద్భయంకరశరాళికరప్రకరుండు చిత్తసం।
జాతవిభాకరుండు వెలుచంబలుచందములంగలంపఁగం।
జాతముఖీకుముద్వతి వెసన్వివశత్వము నొందె స్రుక్కుచున్॥ ౨౦॥

తే॥ గీ॥ చెలివిరులపానుపున మేనుఁ జేర్పనవియు। స్మరునిశరములె కాన నేచందొడంగెఁ।
గడు నలసి చెల్మికత్తెలఁ గన్నొఱంగి। ఘోరవిరహార్తినరిగె శృంగారవల్లి॥ ౨౧॥

కం॥ కలికి మలయంపువలి గరు। వలికిన్ జలదళులబలురవలికి మయూరా।
వళికీరశారికామం। డలికిన్నదిను లికితధ్వానంబున మెలఁగున్ ౨౨॥

సీ॥ తలిరుటాకులజొంపములు దావశిఖలంచు నెంచియందులఁ బ్రవేశించఁ జూచు।
నునుఁదీవలురగంబులని డాసి తత్పల్లవాగ్రజిహ్వలు కేలనంటఁ దివురు।
వెడలుపూఁదేనియ విషధారలనుచు వితర్కించి సారెకుఁ ద్రావఁదలఁచు।
శశికాంతకృతమహీజాతాలవాలంబులోన రడిగ్గియలంచు నురుకఁ దొడరుఁ॥
తే॥ గీ॥ గదిసి మదనుండు వదలక యదనెఱింగి। పదులు నూఱులు గుదులుఁగ నెదనదిమెను।
సురశరమ్ముల విసరుల కోర్వలేక। తనువుఁ దొలఁగంగఁ దలఁచి యవ్వనజగంధి॥ ౨౩॥

ఉ॥ నెచ్చెలులత్తఱిన్ వరమణీభవనాంతరపుష్పశయ్యపై।
నచ్చపలాక్షిఁ గానక రయంబున మాఱని బాఱి కోర్వలే।
కిచ్చటనుండి గోలయిపుడెచ్చటి కేగెనొ యంచుఁ దద్వనిన్।
జొచ్చి నికుంజపుంజములచోటుల నారసి యందు నొక్కచోన్॥ ౨౪॥

కం॥ కలువలచెలి వెలుఁగులచే। నలువుఁ దొలిగి నిదురఁ జెందు నలినియుఁ బోలెన్।
న్దలమగు వలరాయని కా। కలనలయుచు సొలయు లలనఁ గనుఁగొని యెలమిన్॥ ౨౫॥

కం॥ దరియంజని నునుఁ జెక్కులఁ। దొరఁగెడు కన్నీరు వోఁ దుడుచుచు సంస్తా।
పరిపిదిలి జాఱు ఘనకచభరమును సవరించి యిట్లు పలికిరి చెలిమిన్॥ ౨౬॥

ఉ॥ ఆరని ముసంబు మమ్మునకటా యెడఁ బాయని దానవొంటి నే।
తెఱఁగున వచ్చితమ్మ దరిఁ దేలని భూరిమరందసింధులే।
తెఱఁగున నీదికమ్మ వనిఁ దెప్పరమాకపురంపుతిప్పలే।
తెఱఁగున దాఁటితమ్మ సుదతీ తెగువల్గునమ్మ యిమ్మెయిన్॥ ౨౭॥

చం॥ ఇల నెలఁ బ్రాయపుం జెలువలిచ్చ వహింపరటమ్మ దివ్యమా।
చెలువముగల్గు చెల్వలకు చిత్తము సందిటు తాల్మిఁ దక్కఁ జిం।
తిలు దురుటమ్మ మేను వెనుతియ్యని తియ్యని వింటి వేటికా।
కలనలయింతురమ్మ కొఱగాములు సెల్లునటమ్మ యింతికిన్॥ ౨౮॥

ఉ॥ నెమ్మది తాపమేల తరుణీ ధరణీరమణుండు నిన్ను శీ।
ఘ్రమ్మున గారవింపననురాగమున న్విభవంబులందెదో।
యమ్మరొ నమ్ము మద్వచన మాత్మ ధనమ్ముగ లెమ్ము రమ్ముతో।
రమ్మగు నివ్వనమ్మున దిరమ్మగు సంపదఁ జూతమిమ్ములన్॥ ౨౯॥

క౦॥ అనిబాలంగనికేలం గొనిలీలందిగిచియెత్తి కూరిమితోఁదో
డ్కొని కేళీవనపాళికిఁ జనె నాళీజనము మనము సంతసమందన్ ॥ 30॥

సీ॥ అధరబింబములకై యరుదెంచుచిలుకలు తనుసంకుమదగంధమునను బఱవ
ముఖపంకజములపై ముసరు తేఁటులచాలు విమలనాసాచంపకములఁ దొలఁగ
నక్షిమీనములడాయఁ గవచ్చుకోకముల్ నగవువెన్నెలలచే నెగసిపోవ
భుజమృణాళికలఁ గప్పుమరాళికలు నీలకబరికాభ్రములచేఁ గలఁగిపాఱఁ॥
తే॥ గీ॥ జను చెలులమూపులఁ గరంబులునిచి పొదల విరులనిట్టూర్పు గాడ్పుల వేఁడి నులియ
జివురుటాకులు నెమ్మేనుఁ దవిలి వాడ విరహతాపాప్తి వనవీధి వెడలె రమణి ॥ 31॥

క౦॥ ఓజవనీభూజసుమస మాజవిభవ మెఱుకపరచె మానినికపుడా
లీజనమేతత్కథన వ్యాజంబునఁ బ్రొద్దుపుత్తమనుచున్ బ్రేమన్ ॥ 32॥

చ౦॥ వరసుమనోనురాగవిభవంబునగుచ్ఛకుచంబులానిసం
భరితరుచిం జెలంగు మృదుపల్లవపాణులఁ బూఁగనాథుకం
ధరనుగవుంగలించుచులతావనితామణిభృంగనాదసా
దరమృదువాగ్విలాససముదారత మంతనమాడెఁ జూచితే ॥ 33॥

చ౦॥ మనుపువుఁ దేనెనల్కి తెలిమొగ్గలముత్తెపుఁ బ్రుగ్గువెట్టియిం
పొనరు ప్రవాళదీపికలు నొప్పగుపూఁబరపుల్ ఘటించి కుం
జనిలయసీమలిట్లు వరుసన్గయిసేసి మరుద్వరాప్తికై
కనదళివీక్షలై యెదురుగన్గొనెఁ గంటె లతాసతీతతుల్ ॥ 34॥

చ౦॥ అనిశమహానురాగసముదంచితలౌసరసాంతరంగప
ద్మినులమదాంధతన్వడచి ద్రిమ్మరుతుమ్మెద నెమ్మికాఁడుదా
ననయముఁ జూచితే యవినయమ్మునఁ బుష్పిణులైన కొమ్మలన్
దనరఁగనొందుచుండె వనితామధుపాళులకేడ నిల్కడల్ ॥ 35॥

సీ॥ వితతాళిమాలికా వేణువుల్ మ్రోయించి బలు నెమ్మినటనము ల్వొలయఁ జేసి
కలకంఠకాకలీగానంబులలరించి శుకనమండలవిలాసగతులు పూని
కమనీయశుకభాషణములముచ్చటలాడి పలపూరవిరులనవ్వులొలవించి
మంజుకింజల్కరోమాంచగుచ్ఛస్తనాంచన్మహీళాసహస్రములనెనసి॥
తే॥ గీ॥ క్రమశాఖాభుజంబులఁ గౌఁగలించి కలరవస్వనమణితంబులొలయరాస
కేళిఁ జూపించెదాపింఛకృష్ణమూర్తి యివ్వనంబునఁ గనుఁగొంటె యిందువదన ॥ 36॥

క౦॥ వనిసాధుమాధుకరగో।ష్ఠినివర్తిలుచున్నతపసిచిత్రంబుగనా।
తనశోభనలరుగణికల। నెనసిమొగడఁజన్ములం బెనిదిఁగనుఁగొంటే॥ 32॥

మ॥ నలుపైకారుమొయిళ్లభంగిదివినంటన్ బ్రాకిసాంద్రచ్ఛదో।
జ్జ్వలతంబొల్చుతమాలసాలములలోసంపుష్పితాశోకశా।
ఖలుమందానిలకందళాహతులచేఁగంపింపుచుందీవమిం।
చులుఁబోలెంనెఱిమించెఁగాంచితెవనిన్శోణప్రవాళాధరా॥ 33॥

సీ॥ ఆమ్రవల్లరికేలనంటుమల్లెబాలతిలకింపుమీఁదీనిఁదిలకమేని।
స్ఫుటలీలఁజూచఁగదమ్మయిదియశోకపుఁగొమ్మకౌఁగిలింపుముతావిఁగనయఁగ్రోలి।
యిదిప్రియాళువునాలిగదిసిపాదముగీలిముచ్చటాడుచునేగుముదితగోఁగు।
కాంచనంబిదియింతినించితేమఖకాంతిచేరినవ్వుముపొన్నచెలియమిన్న॥
తే॥ గీ॥ శ్వాసమొందింపుమిదిసింధువారమతివ।యువిదకేసరమిదిదీనినుమియుమమ్మ।
యిటులొనర్చినఁగాకయివ్విటపములుసు।మంబులీనవువింటివేమంజువాణి॥ 34॥

క౦॥ అనిజవ్వనికవ్వనితలు।వనితరువిభవంబుదెలిపివరసురభిరజం।
బునఁబసిమిఁదాల్చితనులత।లొనరఁగఁబుష్పాపచయసముత్సుకలగుచున్॥ 35॥

ఇభగతిరగడ॥ పొలఁతి! యాగొజ్జంగి పొదలతేనియసోన।
కళులు పటుచాతకములై మసలె వనిలోనఁ।
జిన్నినునుఁజివురాకుఁ జిదిమితివె కెంగేల।
కన్ను లెఱ్ఱగఁ జేసెఁ గదవె కోకిల బాల?।
ఘనకనకములుఁ గొనుచుఁ గదలె దెమ్మెరముచ్చు।
వనలక్ష్మిసొమ్ము లని వదలఁ డేమనవచ్చుఁ।
గొమ్మ!కయి నంటె ననఁ గోయు మిఁక వంపకము।
నెమ్మొగము చాయలననిచి నదీచంపకము।
కనదనిలగతి నెగయు కప్రపు దుమారములుఁ।
గని వెన్నె లని పఱచెఁ గదె కోకవారములు!
బింబ మని యెదురుకొనె విడచి శుక మెలమావి।
నంబురుహనయన? దవ్వ రసి నీకెమ్మోవి।
జడిగొనఁదొరఁగెఁ గేసరముల మరందములు।
తడిసెఁదద్బిందువుల ధమ్మిల్లకుందములు।

పటు మధుప వితతులభ్రములని మయూరములు।
నటియించెఁ గంటె తన్నటనపుటొయ్యారములు।
క్రూరఫణులనుఁ జుట్టుకొనియె నీచందనము।
చేరఁబోకచటి కోచెలినీకు వందనము।
సేవంగిఁ గోయ కేగెద వేటికి మిటారి।
కాదటే?మరునకది కడుబంగరుకటారి।
కలికి వనదేవతల కర్ణిక్షాకారములు।
డెలిపెనిచ్చటఁజూచి తేకర్ణికారములు।
వేడుకగ విన వేల పికకుహూకారములు।
చేడె యవి విరహిణుల చెవులకుఁ గఠోరములు।
లతలచాటునఁ బెంపలరు నీదు కొనగోరు।
నతివ యల్లయదిపూవని కేలఁ గొనఁగోరు।
నరవిరియుమొల్లవిరులల్లచట మొల్లములు।
మరచిపోఁదగునటే మరునకవి భల్లములు।
మరువంపు సౌరభము మఱలించెఁ గురువేరు।
సరిగాదు దానికిఁక జగతి వేఱొక వేరు।
సుదతిరో చేకొనవె సురపొన్న క్రొన్ననలు।
చదలంటెఁ బుష్పాదులు సారె తద్వాసనలు।
కొలఁదిగననివిరాలిఁ గొని సోలసినదికొమ్మ।
జలజాస్త్రిఁ గొల్తమిక సఖులార రారమ్మ॥ ౪౧॥

తే॥ గీ॥ అనుచువనకేళిసల్పిపద్మాయతాక్షు। లతులవివిధలతాంతసంతతులలోన।
నమితసౌరభరుచిరములైనవాని। నెంచిమదనునకర్పింతమంచు వెడలి॥ ౪౨॥

కం॥ చిత్రింబుగనిటుమరునివి। చిత్రాకృతివ్రాసిపూజఁ జేయుచుభక్తిన్।
స్తోత్రములొనర్చిపంకజ। పత్రాక్షులు కేళిసౌధభాగముఁ జేరన్॥ ౪౩॥

కం॥ చరమమహీధరశిఖరాం। తరసరణిన్దరణిజరుగఁదద్వైరికసాం।
ద్రరజశ్ఛన్నతఁగనెనన। స్ఫురితజపాశోణకిరణశోభితుఁడయ్యెన్॥ ౪౪॥

మ॥ తరుసంఘంబులకెల్లఁబల్లవితచూతత్వంబుఁగల్పించిభూ।
ధరశృంగంబులకెల్లమేరుశిఖరత్వంబుప్రసాదించిభా।
స్వరసౌధాగ్రనతేందుకాంతములకున్ సౌగంధికచ్ఛాయలన్।
విరచించెన్గరతారుణాతపములవ్యోంగకుప్రజ్ఞులన్॥ ౮౫॥

కం॥ ఖరకరుఁడరిగెనురమ్మని।స్ఫురదుదయాచలమువెనుకఁజొచ్చినయిరులన్।
ద్వరఁబిలువఁజనుఁదదాప్తుల।కరణినరిగెనీడలుతొలిగడకునిడుపులై॥ ౮౬॥

కం॥ చారులుదేరుచుగూడులఁ।జేరఁబతంగములుభానుశిలలకుఁదాపం।
బారెన్మృగతృష్ణావా।ర్ధారంజడిఁదీరెమింటరక్తిమమీఱన్॥ ౮౭॥

మ॥ వరసన్మార్గగతుండినుండుత్రిజగద్వంద్యుండనన్వొల్చిదు।
స్తరమాదైవనియుక్తిఁబంకజరజస్సంపర్కుఁడైయెసాంధ్రపశీ।
ఘురసంచానినపద్మినింగలసితద్దోషంబువాయన్మహా।
పరపాథోనిధిలోనఁదామునిఁగెనాభానుండుఁగ్రుంకెన్వెసన్॥ ౮౮॥

సీ॥ చరమదిక్చండికార్చాకాలశాక్తేయరచితకుంకుమరజోరాశియనఁగ।
సింధునాథసగంధసింధురోపరిపరిష్కృతరక్తరాంకవశ్రీయనంగ।
పశ్చిమాంభోనిధిప్రాంతసైకతసముద్భూతవిద్రుమలతాజాతమనఁగ।
స్ఫుటనటత్పటుమహానటశిరస్తటఫణీశ్వరఫణామణిగణచ్ఛాయయనఁగ॥

తే॥ గీ॥ విరహిజనహృద్భయంకరవిషమబాణ।జైత్రయాత్రాసమారంభసంభవాబ్జ।
జాండపూర్ణతదీయశౌర్యాగ్నికీల।సముదయంబనసంజకెంజాయమెఱసె॥ ౮౯॥

కం॥ అనుఁగుజవరాలికౌఁగిట।నెనయకసుఖముడిగిచింతనేగరవిసనం।
గనియొకజక్కవయకటా।యినహీనతనున్నచక్రమెట్లుసహించున్॥ ౯౦॥

చం॥ ఇనుఁడపరాశఁజెందెనిఁకనేటికిజీవనమంచుఁబద్మినీ।
వనితవిషాదవేదనలఁబొల్పడితుమ్మెదచాలుపేరిట।
న్ఘనువిషధారగ్రోలననిశంబమృతస్థితిఁగల్గుటన్మృతిం।
బొనరకమూర్ఛఁగన్నుఁగవమోడ్చెననన్ముకుళించెఁబద్మముల్॥ ౯౧॥

చ॥ తనపతివచ్చునంచుఁబ్రమదంబునరేజవరాలునెమ్మొగం।
బునమృగనాభికాతిలకముంఘటియించెననన్దమంబునౌ।
య్యనబలుకొప్పుముడిన్ముడిచినట్టివినూతనపుల్లమల్లికా।
ఘనకుసుమప్రగోఘమనఁగానఁగనయ్యెనుడుప్రతానముల్॥ ౯౨॥

సీ॥ వైకుంఠశితికంఠవరకంఠకలకంఠకాలకంఠాభల మేలమాడి।
తత శైలతనయాలఘుతమాలహరినీలకాకోలరుచులఁ జీకాకుపఱచి।
యళిపుంజమృగభంజనలవాంజనశుభాంజనాగ్రకుంజరలీలలవఘళించి।
యమునాంబరబలాంబరమహాంబుదకదంబకాదంబకాంతులఁ గలయ మెలసి॥

తే॥ గీ॥ వేల్పుదొరమేనిచాయతో వియ్యమంది। కదిసె సదసాభిసారికాకాముకప్ర।
కామదమృగీమదాలేపకల్పమగుచుఁ। గటికచీఁకటి బ్రహ్మాండగహ్వరమున॥ ౫౩॥

తే॥ గీ॥ ఘనతిమిరసంగమున సంధ్యఁ గాంచి లోక। ములకుఁ బెంచుకొనఁగ నిడ్డలలితతర్ష।
ధృతజనకరూప నైజసంతతులనంగఁ। గజ్జలయుతాగ్రగృహదీపకళికలమరె॥ ౫౪॥

కం॥ ఘనకువలయపాలనకుం। జనుదెంచెడి రాజు విడియఁ జతురతఁ బ్రాగ్ది।
క్కున ఖేచరులెత్తినధా। తనవపటకుటీరమనఁగ ధవళిమవోఁ చెన్॥ ౫౫॥

చం॥ సమయవిటుండు గన్గొనఁగ శక్రదిశావిటి గబ్బిచంటసాం।
ద్రముగ విదిర్చు చెందిరమనందగెఁ బాటలరేఖ యవ్విభు।
న్నెమకి కనంగనవ్వెలఁది నెమ్మొగమెత్తిన నన్సుధాంశుబిం।
బము వెసఁ దోఁచెఁ గాంచి గరిమన్న గనావిలనీల్లె వెన్నెలల్॥ ౫౬॥

తే॥ గీ॥ సోముఁడుదయాద్రికైలాససీమ వెడలి। లోకభీకరమేచరాస్తోకతిమిర।
హాలహలమానెఁ గాని నాఁడంకదంభ। కలితతత్కంఠకాళిమ గానఁబడునె॥ ౫౭॥

సీ॥ వనములెల్లను గల్పవనములు గావించి రాలనెల్లను మగరాలఁ జేసి।
కొండలెల్లను వెండికొండలు గావించి నదులనెల్లను నభోనదులఁ జేసి।
జలధులెల్లను దుగ్ధజలధులు గావించి కరులనెల్లను వియత్కరులఁ జేసి।
సరసులెల్లను సుధాసరసులు గావించి నరులనెల్ల రనుగిన్నరులఁ జేసి॥

తే॥ గీ॥ దైవసృష్టికిఁ బ్రతిసృష్టిఁ దారచించి। బ్రహ్మ మను బోలె జగదంతరంబు నిండెఁ।
గుండలిపచంద్రడిండీరఖండకాండ। సమవిమలధామకౌముదీసముదయంబు॥ ౫౮॥

కం॥ కుముదంబులకు ముదంబులు। కొమరారెఁ జకోరికలకుఁ గోరికలూఁదవెన్।
రమణులకును రమణులకును। దమి వెలసెన్ దమియు వెలసెఁ దనపతిశోభన్॥ ౫౯॥

కం॥ పగఁటి విరహంపు వేఁడిమి। నొగిలిన కుముదినులు చలువనూల్కొనసాంద్రం।
బుగఁ బన్నీరు కరంబులఁ। దొఁగ చెలిచిలికెననరాలెఁ దుహినకణంబుల్॥ ౬౦॥

వ॥ మఱియు సుతోదయోల్లాసంబున వియదుల్లీఢకల్లోలంబై యుల్లసిల్లి పాలవెల్లి వెల్లివాడిచి పుడమి నెల్లెడల నల్లుకొనియెనన నంతకంతకు ననంతంబుగా దిగంతంబులనా

క్రమించుచు నంబరతరంగిణీఝురంబులనుండి భూమండలంబునకు డిగ్గు మరాళమాలికల
పోలిక నస్తోకవ్యాకోచకైరవవిసరంబులగు సరోవరంబుల బ్రసరించుచు విధుంతుదవద
నగహ్వరప్రవేశాభ్యాసవశంబునం బోలె సాంద్రేంద్రనీలజాలగోళంబులందూఱుచుఁ దిమి
రజలదసమయ విగమంబగుటయుఁ బెల్లుఱెల్లువిరిసెనన విశాలంబులగు కూలంకషాకూ
లంబులం గ్రాఁగుచుఁ గుసుమసముదయంబు చందంబునఁ దరులతాచ్ఛదంబుల ధాళధళ్యంబు
నమెఱయుచు మదకేసరికిశోరవారంబు తీఱున శిఖరిశిఖరంబులెక్కుచు లీలం దేలియా
డువాలుగుమీలబెళుకుల చెన్నున మున్నీటిపెన్నీటికరడులమీఁద దీపించుచుఁ గాముదిద్వా
నగుట నభివ్యక్తశుద్ధవర్ణంబై ద్విజముఖంబుల వ్యాపించుచుఁ జంచద్విధుమండలహారిణము
ఖపరిచ్యుతరోమంథబంధురఫేనపుంజంబుల వడువున సంకేతకుంజంబులపై రంజిల్లు ఫుల్లమ
ల్లికామంజరుల మేదురామోదంబున మోదంబు రెట్టింపఁ దొలుతఁ గలసి యలసిన కాముకు
లబదరియుపరిసురతంబు నెఱపు తరుణుల సుఖస్వలత్కాళల తెఱంగున నగ్గరంగి తోరంగు చెంగ
ల్వ[illegible]ట్టుల జలజలని తెలినీటితళుకుల నేకీభవించుచుఁ బెంపు గాఁగురియు నమృతధా
రాపరంపరలకుఁ గుంపులై యింపొలయు వియత్తలంబున కెత్తిన కుత్తుకలు వంపక బెంపార
బెంపిల్లు గూయుచుఁ గుత్తుకబంటిఁ గ్రోలి వెక్కసంబుగఁ బుక్కిళ్లం బట్టి యొండొంటికంది
చ్చుచు వచ్చినమచ్చికలం గలయు నచ్చకోరదంపతుల సొంపునఁ బటికంపుగిన్నెలఁ జె
న్నలరు నారికేళాసవంబు లానఁ గొలందిఁ గమిచితదీయమదోన్మాదంబున వినోదంబుగా
బాడు విచిత్రగీతంబుల వ్యత్యస్తసల్లాపంబుల వింతవింతనటనంబుల వికృతచేష్టావిలా
సంబుల నకారణహాసంబుల మెలంగి తెలివిఁగని వలపుఁగొని మణిమంజీరసింజితంబులు
లియ నలరుఁబోదలకుం జని పనీపవనంబునం బయ్యెదలుఁ దొలఁగింపక యొతొలంగ బంగారు
బొంగరాలహారంగునఁ బొంగారు మొలకచనుంగవల మిలమిలలంగనుపట్టు శిబ్బెంబులు
గుబ్బటిల్ల గొబ్బునం గవుంగలించు ప్రాణవల్లభులతో మల్లడిగొని వివిధబంధచమత్కారం
బులం గూడి క్రీడించు మించుఁబోడుల చంచలదృగంచలప్రభల రాణించు వజ్రతాటంక
లాలాటికాచాకచక్యంబులతో సఖ్యంబొనర్చుచు నిట్టఖండపాండురచ్ఛాయామండలం
బుల మెండుకొని పండువెన్నెలలు గాయఁగాయ జూండేయెడం జూచినఁ దానరైయె యమే
యవిక్రమంబునం బాయక చాయలు దేరు సాయకనికాయంబులేయ దాయరైయె మలయా
నిలుండు డాయ నుల్లంబు ఝల్లనం దాలిమిఁ దూలి నిదుర నొందక కొందలిరుపాన్పు డిగ్గి పవ
మానవిలోలబాలవల్లరియుం బోలె సోలుచు నక్కళావతీసతీతిలకంబు నిరంతర నిజస్వాం
తచింతిత మహీకాంతకాంతాకారంబు కన్నులఁ గట్టినట్లై కంటఁగంటివనని దిగ్గన లేచి బయ

లుఁగవుంగలించుచుఁగలవళించుచు నక్కటా దైవంబునిర్దయుండయ్యె నేమిసేయుదు
నని బుడిబుడి కన్నుంగవ నీరుజడిఁగొన నడుగులుతడఁబడ నడుముగడగడవడఁక వెన్నెల
యేటనురికెదనని చంగునందుముకఁ జూఁచుఁజూరుక్కున చొక్కపుమేన నక్కజంబుగ
వెన్నెలలుగ్రక్కునసోక మిక్కిలివెక్కసంబునమూర్ఛిల్లిన నొయ్యన నొయ్యారంబుగ
నెయ్యంపుతొయ్యలులు చయ్యనయ్యింతినెత్తికొనివచ్చి శిశిరజల బిసకిసలయ ఘశిశక
లాదుల శీతలోపచారంబుఁగావింప నెట్టకేలకు సేదఁదేరి తేటిచూచి చంద్రునుద్దేశించి
యుపాలంభంబుగా నిట్లనియె॥ ౬౧॥

మ॥ సుమనఃప్రీతియొనర్చిసత్పథచరిష్ణుత్వంబుసర్వజ్ఞమౌ।
ళిమణిత్వంబునుగాంచురాజవయిహాళింశంబరారాతిస।
ఖ్యమునన్మీఱుచుభీరుతాకలితపాంథాళిన్దయాశూన్యతన్।
శ్రమమొందించికలంచుటెంచనృపధర్మంబేనిశానాయకా॥ ౬౨॥

చం॥ హితసరణిన్సురంబునవహించెమహేశ్వరుఁడంచుగర్వభా।
సితగతిమిన్నుముట్టెదుశశీమతినిన్నరకాలఁదన్నిము।
న్నతఁడెకదాకళాగతివటంచుదయన్విడచెన్గతావమా।
నతఁగని,సిగ్గుఁజెందవుమనంబుననీకుఁబరాకువచ్చెనే॥ ౬౩॥

కం॥ తొలిలోకములకువంకరఁ।గలిగింతువటంచు నెంచి,కమలభవుఁడుని
న్నిలఁబుట్టినపుడెవంకరగలవానిఁగఁజేసెఁగా దెకమలవిరోధీ॥ ౬౪॥

సీ॥ ఇందిరావిభుఁడాత్మహృదయస్థితునినిన్నుదోషాకరుఁడవంచుఁదొలఁగఁజేసె।
నతఁడుధాతయుస్వకీయాబ్జపీఠికిఁజేటొదవునంచునత్రినేత్రముననునిచె।
నందుండితారాపహరణవైఖరిఁజూపనతఁడుపాథోరాశియందువైచె।
నచటరాజీవసంహారణంబుఁగావింతువనియబ్ధియంబరంబునకుఁద్రోచె॥
తే॥ గీ॥ నచటరాహువుమ్రింగియునఱుగకునికి।మఱలఁగ్రక్కంగనీకళిమసలిజగతి।
నందఱికిఁగంటకుఁడవౌచునిందనొందు।నీకునిలకడగలుగునేనీరజారి॥ ౬౫॥

ఉ॥ ఇంతటివానినిన్నుఁదమహృత్పథమందుఁదలన్భరించుశ్రీ।
కాంతునకుంగిరీశునకుఁగాననదావహలాహలానలా।
నంతనితాంతకీలములనానుట లెంతటివింతయామినీ।
కాంతతలంపదద్వయముఁగాంచునెధాత్రిభవత్సమాగ్రితన్॥ ౬౬॥

వ॥ అనిపలికి తళుకువిరిమలుఁకులుఁచిలుకు వలఱేనినుద్దేశించి॥ ౬౭॥

కం॥ కమలాక్షునికొమరుఁడవై। సుమనోధర్మంబుఁ బూనుచుఁ బ్రవర్తిలియున్।
కమలాక్షుల నేచెదవో। మమత మధువ్రతగుణంబు మానవు మదనా॥ ౧౮॥

తే॥ గీ॥ తొలుతఁ గుజనుల నలరించు చెలినిఁ బనిచి। బలము నడవుల నిడియించి సాంఘజనుల।
మానధనములఁ గొంచు దుర్మార్గనియతి। నలగు శంబరఘాతి వీవబ్జబాణ॥ ౧౯॥

కం॥ యుగవిగమజగత్క్షయదం। బగు శర్వుని కంటిమంట నంటి కెడసియు।
న్మగుడఁ బ్రస్పృతికి తివీవ। ధ్వగజనదురితమునఁ గాదె వారిచరాంకా॥ ౨౦॥

ఉ॥ శంబరదానవుండు నినుఁ జౌర్యమునం గొనిపోయి వార్ధిలో।
నంబడఁ ద్రోయ నందొకఘనంబగు మీనము మ్రింగ దానిగ।
ర్భంబున నప్పు జీర్ణతనుఁ బాటిలి నన్విరహిప్రవజంబులో।
కంబున దావవహ్ని నిటు గ్రాఁగి కృశించునె యో మధుప్రియా॥ ౨౧॥

వ॥ అని పలికి చెంగట జెంగలువల పుప్పొడులు జిమ్ము కమ్మతెమ్మెర పైనలిగి॥ ౨౨॥

కం॥ జగమునకున్ బ్రాణంబని। పొగడుదురందరును నిన్ను భువిలో హృదయా।
శుగమగుట యెఱుఁగరిఁక నీ। దగునడవడి యేమి చెప్పనగును సమీరా॥ ౨౩॥

కం॥ సూనతరులకు ఫలభంగం। బొనరించుట చేజనించు నురుపాపము లె।
ల్లనుఁ గాలభుజగరూపము। లనునినుఁ గబళించుఁ జంచలగుణా పవనా॥ ౨౪॥

చం॥ అని హరిణాంక జీవనచరాంక సమీరుల దూఱి వారిజా।
నన మణిమందిరాంతరమున న్విరిపాన్పు పయి న్విరాలిసో।
లినఁ గడు జాలి నెచ్చెలులు లెమ్మిదె తెత్తుము రాజనందను।
న్ననివినియంచు నూరడిలఁ బల్కఁగ నంతఁ బ్రభాత మాటయున్॥ ౨౫॥

సీ॥ కాలజ్ఞ తనురథాంగములకు రవిరాకఁ దెలిపె నాగృకవాకు తెలమి మ్రోసెఁ।
దనరాక నినుఁడు పద్మినికిఁ జెప్పఁగ బంపు శుభదూతయన వేగుఁజుక్క వొడిచెఁ।
దపనుండు దమసంపదలు గొనుననుభీతి నన దీపికలు వెల్లనైవడంకె।
వరుణరతి త్రుటద్వారుణీస్తనహీరమండనంబన సుధాంశుండు గ్రుంకె॥
తే॥ గీ॥ త్వరనరుగుదెంచు కమలబాంధవుని మేటి। తేరు మీదను గనుపట్టు తెల్లపట్టు।
టెక్కియపుఁ జాయయనఁగఁ బెంపెక్కి ప్రాచి। నల్లనల్లనఁ దొలివెల్ల తెల్లమయ్యె॥ ౨౬॥

చం॥ ఉదయనగాగ్రవేదిపయినుజ్జ్వలకల్యవధూండుసంభ్రమం।
బొదవద్విజాగ్రణుల్ శుభ్రితిహితోక్తిశుభస్వనములెల్లెలంగఁబ్రా।
క్పదమలకన్యకంఠమునఁగట్టినరత్నసువర్ణసంపదా।
స్పదమగుతాళిబొట్టనఁగభాస్కరబింబముతోఁచెఁదూర్పునన్॥ ౭౭॥

తే॥ గీ॥ ప్రియునితోఁగూర్మిరేలెల్లఁగ్రీడసల్పి। యలసినిద్రించెఁగుముదినులనఁగమొగిచెఁ।
దొగలినకరాళిగిలిగింతఁదగిలిపద్మి। నీతతులునవ్వెననవిచ్చెనీరజములు॥ ౭౮॥

కం॥ మక్కువలరనక్కనిడి। యొక్కలతోఁగూఁగలించుయోనికిముద్దు।
ల్గ్రక్కనఁదనముక్కనిడి। జక్కవకవఁగూడెనొక్కజలజపుటెంకిన్॥ ౭౯॥

చం॥ ఒకపొలయల్లచేఁగలయనొల్లకపంతములాడిగుట్టుపు।
చ్చకతరితీపుచూపులనెజాగొనరించుమనెన్నఁగూడితూ।
రకుఁగనినట్టిదంపతులరూఢిగమేల్కొలుపందలంచెనా।
శుకపికశారికల్వలుకఁజొచ్చెగృహాంతరపంజరంబులన్॥ ౮౦॥

ఉ॥ రాతిరిచంద్రకాంతితిమిరంబులగీటడగింపఁదచ్ఛిశు।
వ్రాతములబ్జకోశవివరంబులడాగిభయాప్తిసాత్త్వరూ।
పాతిశయంబుమానియితరాకృతిఁగైకొనెనోయనన్సరో।
జాతరజఃపిశంగతనుసంగతిఁబొల్చెమెలంగెభృంగముల్॥ ౮౧॥

సీ॥ ఈరీతినిజవిభాపూరితాఖిలదిశామండలుండగుచుభానుండుదోఁప।
నపుడువీణాధరీవ్యాప్తమంగళగీతరాజిమేల్కనిముఖ్యవ్రజవిభుండు।
తత్సమయార్హకృత్యములునిర్వర్తించిరమణీయమణిమందిరముననుండ।
దివ్యదృష్టినెఱింగిదేవసమానుండుగాలవుండుమృకండకణ్వముఖ్య॥

తే॥ గీ॥ మునులతోనటకరుదేరజనవిభుండు। సముచితవిధానములవారిసత్కరించి।
కన్యనడుగంగఁబురజైత్రుకడకుఁబనుప। వారలరిగిరితత్సభావాసమునకు॥ ౮౨॥

వ॥ ఇట్లువిచ్చేసినమునిపుంగవులను॥ ౮౩।

మ॥ కనిగంధర్వవిభుండువారికినమస్కారాదికృత్యంబులిం।
పునఁగావింపుచుదీవనల్వడసిమత్పుణ్యంబునేఁడాతపో।
ధనులారా!ఫలియించెసర్వమునుభద్రింబయ్యెమీరిందువ।
చ్చినకార్యంబెఱిఁగింపుఁడేసఫలతన్ జెందింతుశీఘ్రింబుగన్॥ ౮౪।

చ|| అనినమునీంద్రులిట్లనిరనర్ఘగుణోజ్జ్వలుఁడచ్యుతాంశసం।
జనితుఁడుసర్వలోకనుతశౌర్యయశోబలరూపసత్కళా।
ఘనుఁడుమఖివ్రజప్రభుఁడుగానభవత్తనయాలలామమున।
య్యనఘునకిచ్చికీర్తిఁగనుమయ్యధరన్స్వరజిత్సమాహ్వయా|| ౧౫||

వ|| అనినన్గంధర్వవల్లభుండునిజాత్మజాంతరంగంబుకలవాణివలననంతకుమున్న యెఱింగినవాఁడుగావున|| ౧౬||

చ|| అటులొనరింతునేననతశాస్త్రనుమన్మనుతెల్లఁబల్కిన।
చ్చటఁగలవాణితచ్ఛుభవచస్స్థితిఁదావినియోగితల్లిచేం।
గటనలరారుకన్నియకుఁగ్రన్ననఁదెల్పఁగనవ్వెలందివి।
స్ఫుటరముదాత్మమోదరసపూరితభూరితరాంతరంగయై|| ౧౭||

మ|| మునివర్యుల్శుభలగ్నముందెలుపసమ్మోదంబుతోనప్పుడ।
జ్జననాథోత్తముతండ్రిపాలికినభస్సంచారిజంఘాలునిన్।
ఘనలీలన్శుభరేఖయిచ్చిపనిచెన్గంధర్వనాథుండు, వే।
చనిశత్రుంజయుఁగాంచివాఁడుదెలిపెన్సమ్యక్శుభోదంతమున్|| ౧౮||

ఉ|| ఆనరనాయకుండువినిహర్షమహాంబుధిఁదేలినందనుం।
డైనమఖివ్రజాధిపుసమగ్రశుభంబునకైచనన్ప్రితి।
స్థానపురంబువెల్వడెభటద్విరదాశ్వరథాతిసాంద్రసే।
నానివహాప్తబాంధవజనద్విజమంత్రిసుహృత్సమేతుఁడై|| ౧౯||

కం|| ఈరీతివెడలిశైలమహారణ్యాధ్వములుఁగడచియల్లననాథా।
త్రీరమణుఁడుగంధర్వనగరీరంగమునందునున్ననిజసుతుఁగనియెన్|| ౨౦||

వ|| కనుంగొనిశత్రుంజయుండుదనకునమస్కరించునందనుంగవుంగలించి శిరంబు మూర్కొని సంతోషితస్వాంతుండై నిజపరివారంబునయ్యారామంబునంబటకుటీరము లందువిడియించియుండె నంత నక్కడనప్పురజైతుండంతఃపురంబును బురంబునలంకరించుటకు ఖచరకంచుకీజనంబులనియోగించి కుబేరాదిబంధువులరావించుటకుఁబ్రధానులఁ బంచెనంత|| ౨౧||

సీ॥ ఆపరంజినీటనూత్నపుఁజాయఁదీర్చిరికోటకొమ్మలహర్మ్యకూటములను।
కనకనిర్మితపతాకలునిల్పిరున్నతప్రాసాదగోపురోపరితటులను।
గలయఁబన్నీటిచేఁగలయంపిఁజల్లిరిరాజమార్గాంగణరంగములను।
కస్తూరికాగరుకర్దమద్రవములనలికిరికేళికానిలయములను।
తే॥ గీ॥ నెల్లెడలముత్తియఁపుమ్రుగ్గులుల్లసిల్లఁ। గదళికాక్రముకస్తంభకలితనలద।
కాయమానహరిన్మణీఖచితతోరణములుపన్నిరిద్వారభాగములగముల॥ ౯౨॥

లయగ్రాహి॥ లీలగృహలక్ష్మిగలమాలికలనెన్నఁదగుపాలికలఁగ్రాలుమణిడోలికలఠీవిన్।
వాలికలమొత్తములకేలికలనమ్మెఱయుబాలికలదృగ్జలజపాలికలతేవన్।
మేలగుకపోతకులపాలికలవ్రాలినమరాళికలఁబొల్చుసునశాలికలవన్నెన్।
కేళికలనాంచితమదాళికచలాదుపచనాళికలనాదములప్రోలికళమించెన్॥

వ॥ ఆసమయంబున వివిధవిచిత్రవిమానవితానంబులతో నిందీవరాక్షు ప్రియంవద చిత్రసేన జీమూతవాహనాది గంధర్వులును నలకూబర వరాహకర్ణ గజకర్ణ సుకేతు మణిభద్ర ప్రభృతియక్షులును రైవతప్రముఖగుహ్యకులునుమందారముఖ్యవిద్యాధరులును నేగుదేర వారలందోడ్కొని యప్పురజైత్రుండు శత్రుంజయమహారాజన్యుకడకరిగి సవినయప్రియసంభాషణాలింగనాదులనతనినాదరించి తత్పరిజనంబునుఁ దగినవిడిమట్లులవిడియించి మగిడి యాస్థానంబునకేతెంచి పెండ్లికొడుకున్నావించుటకుఁబంచినం దివ్యాంగనలుమంగళగీతంబులతోశోభనాక్షతంబులున్నపాలుఫాలతలంబుననునిచిరంత॥ ౯౩॥

ఉ॥ సంపఁగినూనెనంటిపెలుచన్నసపూనఁగనల్లువెట్టిమే।
ల్పైంపులనత్తుసొంపుదులకింపఁబునుంగుజనుంగవంగుబా।
ళింపమెఱుంగుముంగురులు లేఁజెమటన్నదనైనటింపనై।
లింపవధూటియొక్కతెసలీలగతిజ్జగతీశుమౌళికిన్॥ ౯౪।

కం॥ అలకములువిప్పిగంధామలకంబిడిచెలులుసంకుమదపుమెఱుఁగుతోఁ।
దలిగొజ్జఁగిపన్నీటజ్జలకములాడించిరెలమిజనవరతనయున్॥ ౯౫

సీ॥ వలిపెమణుంగుచేఁజెలియొత్తుదడియొత్తఘనదుకూలములొర్తుగట్టనొసఁగె।
కస్తూరితిలకమొక్కతెదిద్దనొకతెసాంకవపటీరాగరుకలపములఁదె।
మౌళిపైనొక్కతెమకుటంబుసంధింపనొకతెముత్తియఁపుబాసికముఁగూర్చె
నొకతెకేయూరహారకలాపములుపూన్పనొక్కతెకట్టాణియొంటులిచ్చె॥

తే॥ గీ॥ నలినయొక్క తెకల్పమాల్యంబువైవ। నొకతెకంకణరత్నముద్రికలు దొడిగె।
నఖిలభూషణభూషితుండగుచు భావ। సుందరంజిల్లెం బూర్ణచంద్రుండువోలె॥ ౯౭॥

మ॥ గంధర్వేంద్రనియుక్తులై కదిసెలగ్నంబంచు మంత్రుల్దొరల్।
గంధేభాశ్వశతాంగభూరిభటరంగజ్జైత్రవాదిత్రధా।
రంధర్యాన్వితులై చువచ్చి యమరేంద్రప్రేషితాభ్రద్విప।
స్కంధారూఢునిం జేసి యుత్సవముతో క్ష్మామండలాఖండలున్॥ ౯౮॥

ము॥ త్వరతో నత్తఱిం బౌరవారవనితావారంబ పౌరప్రపా।
క్షరసంబుప్పతిలన్నృపాంగణమణీసౌధంబులన్నిల్చి భా॥
స్వరలీలన్ జతురంగసేనగొలువన్ వాదన్ని పైవ్రజబం।
ధురఘంటాపథసీమ భూమివరసూనున్ గాన్చె నంచద్గతిన్॥ ౯౯॥

చం॥ బలువలపూరం జెందిరిక పావడపైసరిగంచుచీరకెం।
దళుకులు దేరం బెన్నెరులతావికిం దేటులు చేరం గొల్వులు।
గ్గళుకులు మీఱం దారకడకంటికిం దారదృగంశుపాళిక।
ల్వలజిగితీరు గేర నొకవారవిలాసిని చూచె నవ్విభున్॥ ౧౦౦॥

చం॥ పగడపుమోవితో జిలుంగుపయ్యెదతోం దమిం గొల్వుబొల్పుతో।
నిగనిగమించు శబ్దములనిగ్గులతోం దగుగుబ్బదోయితో।
సొగసగువేణితో బెళుకుచూపులతో లలితేతనవ్వుతో।
జిగిమొగమ్మువాల్గొలుక చేడియ చూచె ధరాపురందరున్॥ ౧౦౧॥

చం॥ సురుచిరగల్లభాగములశోభలు గమ్మలనుల్లసిల్లందా।
మరనిరసించు నెమ్మొగము మందరుచుల్వెదచల్లం గంచెల।
స్ఫురితరమై బిగిన్వడలు గుబ్బజగాజిగిగుబ్బటిల్లవే।
మరునిలు చెమ్మగిల్ల నొకమానిని గాంచె ధరావరోత్తమున్॥ ౧౦౨॥

ఉ॥ బాలిక యొర్తు వేగంజని, బంగరుమేడను నిల్చి వేడ్క భూ।
పాలతనూజుం జూచు నెడం బయ్యెదయూర్పులగాలి మూలినన్।
గేలనమర్చ్చి చోదమి నొగిన్విడి నీవి యుజారభర్మపాం।
చాలిక చాటుం జేరెగ రసంగ్రథితాంశుకమైత్రపాగతిన్॥ ౧౦౩॥

సీ॥ హీరభూషణధౌతయై రాచిలుకం గేలం గొనిజూచె నజూరాణియనంగనొకతె।
కనెమోహవివశయై కదలక మేడయంచున నిల్చె మణిపుత్రియనంగ నొకతె।
హరినీలమంచకోపరి నుండి వీక్షించె ఘనము పై మించుమించనంగనొకతె।
పగడంపుగొణికదాపుగ హల్లిచూచెను ఘటితకాంచనవల్లికయన నొకతె॥

గీ॥ వ్యత్యయధృతాభరణలీలయగుచుసంభ్ర। మాంచితరయానుగతివచ్చికాంచెనొకతె।
భువనమోహనమంగళస్ఫురితరూప। వైభవోదారునమ్మహీవరకుమారు॥ ౧౦౪॥

వ॥ ఇత్తెఱంగున ముదాయత్తంబులగుచిత్తంబులనలరు నత్తామరసనయనల తరళా విరళధవళధవళేతరదృక్ప్రసారంబులకనుసారంబులై కైరవేందీవరతోరణంబులుద్దామ చామరసమీరవారంబులంజలింప నిలింప కింపురుష చంపకగంధుల చికురబంధగంధంబులకు వెఱచి గంధసింధురకుంభంబులఁ ద్రాలు బంభరంబులరొదలంబొదవు నారట్టజఘనాట్టాణఘోటకగళాటకహాటకకటకకింకిణీగణనటీకంకణమణిమంజుమంజీర శింజితంబుల దిదృక్షుజనవచనకోలాహలంబులనుఁగ్రిందుపరచి క్రందుకొను సురదుందుభి డమామికా కాహళ మృదంగ పుంఖానుపుంఖశంఖవేణువీణాదివాదన నినాదంబులుఱోదసినిండ నిండారవిరిసినపుండరీకమండలంబు గండడంచు పాండురపుండరీకంబులమెండుమీఱిన ముత్తెంపుజల్లులజిగివెల్లువలనల్లుకొను వెల్లపట్టుసిడంబులనడుమఁబగడంబుడంబువిడంబించు దట్టంపుకెంపుటాలవట్టంబుల కట్టెనిగ్గులకునిట్టలంబుగఁజొట్టంబులై నట్టువచెలుల యంగదట్టంబులమీఁదిపుట్టంబులంగప్పి యుప్పరంబెగయుసౌరకేయూరమకుటఘట్టన రత్నరజంబులుమెఱయ వఱదలుగఁదొరఁగు డిండిమవాదనోత్పాదితవేదండగండమదజలంబులఁబంకిలంబగునేలంగాలూనకసమ్మర్దంబునంద్రోపాడఁద్రొక్కికొనుచుపౌరుల విలాసంబుగనప్పట్టఁ బట్టపగలుగాఁజంద్రజ్యోతులుఁవెలుంగ నభంగశృంగారరసతరంగంబులతెఱంగునఁగురంగధరమరీచిసధ్రీచీనరుచిరంబై చీనిచీనాంబరకిరీటాంగదహారహీరచాకచక్యంబుచెన్నొందమందగమనంబునందగుచతుర్దంతదంతావళంబుపైనింద్రుండునుంబోలె నృపనందనుండురాజభవనాంగణంబుచేరవచ్చెనంతనక్కడ। ౧౦౫॥

కం॥ సుందరులప్పుడుబంగరు। బిందెలపాటీరసలిలపృథుధారలన।
య్యిందుముఖిజలకమార్చిర। హిందడియొత్తిరనితాంతమృదుచేలములన్॥ ౧౦౬॥

చం॥ కలితదుకూలమింపలరఁగట్టిలలిందిలకంబుదిద్దిక।
జ్జలమిడిపారిజాతసుమసంఘములున్గలపంబుఁగూర్చిస।
ల్లలితమణిస్ఫుటాఖిలకలాపకలాపములన్ఘటించికాం।
తలపుడు దెచ్చిరవ్వికచతామరసాక్షివివాహవేదికిన్॥ ౧౦౭॥

కం॥ ఇటభవనద్వారముమం। దటకున్వచ్చునృపతనయునకునెదురుగనం।
తటవసుమంతుఁడుసనిచెం। గటఁగరి డిగ్గిమ్రొక్కునతనిఁగనిదీవించెన్॥ ౧౦౮॥

వ॥ దేవర్షిభూదేవమంగళాశీర్వాదనాదంబులును బృందారకవందిమాగధులకైవారంబులును వేల్పుగాణియల లక్ష్మీనారాయణకళ్యాణంపుఁబాటలసన్నంపుటెలుంగులును భూనభోంతరంబునిండ నభ్యంతరనిశాంతంబునకు సామంతహితమంత్రిసహితంబుగాఁ దోడ్కొనియేగుతతినృపనందనుండందంద పుణ్యాంగనాజనమణిభాజననీరాజనోపచారం

బులాదరింపుచుఁ గక్ష్యాంతరద్వారపార్శ్వనిక్షిప్తమంగళకలశముకురాదిభద్రపదార్థంబుల
నీక్షించుచును వయభానుండను గంధర్వప్రధానుం డొసంగు నీఁగిగ్రామనిపువ్వు లక్షైదండఁ గొ
నుచు నల్లనల్లన నడచి గారుత్మతతోరణవిరాజితవిద్రుమస్తంభసంభారబింబితరంభాదిదివి
జరంభోరుకలకలకరంభితకళ్యాణక్రియారంభంబును సైరంధ్రీకరధృతకస్తూరికాది నిస్తుల
పరిమళవస్తుఘుమఘుమాయమాన కనకపాత్రంబును బురోహితబ్రాహ్మణబంధుపురంధ్రీ
బృందనీరంధ్రంబును నగు వైవాహికమందిరంబునడుమ నడరు మరకతమణివేదికోపరికు
రువిందచరణాంచిత కాంచనపీఠంబున నధివసించె నప్పుడు॥ ౧౦౯॥

కం॥ ఆగమవిధిసహితముగా। నాగంధర్వపతియొసఁగె నవనీపతికిన్।
ద్యోగోదధిమధుగుడసుప।మాగుంభితమై చెలంగుమధుపర్కంబున్॥ ౧౧౦॥

కం॥ కలుములచెలికెనయగుము।ద్దులకూఁతుందా నుదనముతొయ్యాలియుధరా।
తలనాథతనయుహరిగతిఁ।బోలుపునవర్చించి ధారవోసిరియొలమిన్॥ ౧౧౧॥

వ॥ ఇవ్విధంబున వైవాహికమంగళం బాచరించి గంధర్వవల్లభదత్తంబగు నుపా
యనంబులతోఁ గన్యారత్నంబును దోడ్కొని నిజపరివారంబుతో మఖవ్రజాధినాథుండుని
జపురంబుఁ బ్రవేశించి యభ్యంతరమందిరంబుఁ జేరిన నచ్చటిసుందరీబృందంబమందానం
దంబున॥ ౧౧౨।

ఉ॥ అంతఁ గళావతీసతి నిహాళిని కేళిగృహంబు చెంత న।
భ్యంతరమందిరంబున సుఖావహశోభనకార్యపద్ధతి।
న్సంతసమొప్పఁ దల్పునటుఁ జయ్యన మాయమఖవ్రజుండుదా।
[illegible]బుఁ జెంది వసనింతిని గాఁగిటఁ జేర్చెఁ బేర్మితోన్॥ ౧౧౩॥

ఉ॥ తోడనె యమ్మఖవ్రజుఁడు తొయ్యలి నొయ్యన శయ్యపైఁ దగ।
న్గూడఁగఁ జేర్చి బల్మి నుపగూహన మొప్పఁగఁ జేసి చెక్కుల।
న్బేడిమి మీఱ ముద్దులిడి పాల్పరదచ్ఛదమానిమానిని।
న్గూడి సుఖాప్తి నాత్మరతిఁ గొల్లఁగఁ దేలె విలాసవైఖరిన్॥ ౧౧౪॥

ఉ॥ ఒండొరుకోర్కెలిమ్ముగ మహోత్కటమై విలసిల్ల రాగము।
ల్మెండగు చుండ బల్మి మెయి మేకొని బంధగతుల్ప్రగాఢమై।
యొండొరు మీఱి భూరిరతు లొప్పఁగ సల్పిరి ముక్తకామిని।
న్దండిగఁ గూడు యోగిగతి ధన్యత నాత్మసుఖంబుఁ దేలుచున్॥ ౧౧౫॥

వ॥ ఇట్లమ్మఖవ్రజనాథుండు నిరంతరసుఖానురాగంబుల భోగంబులు గాంచుచు
నక్కళావతీసతీతిలకంబుతో సుఖంబుండె॥ ౧౧౬॥

కం॥ అనిమార్కండేయమహా।మునిక్రోష్టికిఁ జెప్పినట్లు ముదమునఁ బక్షుల్।
ల్వినిపించిన నపుడా జై।మిని సంతసమంది పేర్మి మెయి సుఖముండెన్॥ ౧౧౭।

శా॥ ఆశాపాశవినాశభాసురదయాహాసస్ఫురద్భాకన।
ద్వేశాయీశదిగీశవంద్యవరనిర్వేశామహేశాసువీ।
కాశాసీనమునీశమానసలసత్కైవల్యరూపైకచి
త్కోశాశుభ్రశరీరపన్నగధరాకూటస్థసర్వేశ్వరా॥ ౧౧౮

కం॥ శ్రీపతివాక్పతినుతపర।మాపోజ్యోతిస్స్వరూపయపవర్గమయా।
పాపౌఘనాశశంకర।కాపథజనదూరధీరగౌరీరమణా॥ ౧౧౯॥

కవిరాజవిరాజితం॥ వినమితమానివరావనపావనవిశ్వకృతప్రవిచక్షణధీ॥
మనసిజసంహరమర్దితగహ్వరమంగళకారణమానసధీ।
ఘృణిశశిసూర్యవిలోకనశ్రీకరగృధ్నసుపూరణసర్వసుధీ।
జనవరవందితశాశ్వతభాస్వరసన్మయచిన్మయబోధనిధీ॥ ౧౨౦॥

మాలిని॥ కవిజనపరిపోషా-కావ్యవిద్వజ్జిగీషా।దివిజమధనరోషా-దివ్యభవ్యప్రభూషా।
సువినయపరిభాషా-శోభితానందవేషా।ప్రవిమలహతదోషా-భక్తచిత్తప్రజోషా॥

గద్య.

ఇదిశ్రీమదిమ్మానేన్యన్వయపయఃపారావారరాకాసుధాకరానవరతదేవబ్రాహ్మ
ణపూజావిధేయదిగంతరాక్రాంతయశఃపరిపూరితశ్రీబాపనార్యపౌత్రవీరే
శలింగనాయకపుత్రశ్రీమద్గౌరీరమణచరణారవిందామందమకరంద
పానతుందిలేందిందిరాయమాణశ్రీదక్షిణామూర్తిరామయోగి
గురుప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషాచతు
రకవితావితానానూనవైభవబుధజనవిరాజ
మానశరభలింగాభిధానప్రణీతంబైన
యలంకారచంద్రోదయంబను
మహాప్రబంధంబునందు
సర్వంబును
చతుర్థాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

